# శ్రీమద్భగవద్గీత

[ ఆంధ్ర పద్యానువాదము ]

శ్రీ కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి
శ్రీ గట్టి లక్ష్మీ నరసింహ శాస్త్రి

. సాహితీ . సమితి . తెనాలి .

# విషయ సూచిక

# శ్రీ మద్భగవద్గీత

## అనుసంధానము

ఎవనికూర్మి మూఁగి నెంతయు వాచాలుఁ,
గుంటివానిఁ బెద్దకొండలతల
లెక్కఁ దూఁకఁ జేయు, నెవఁడు పరానంద
మయుఁడు శ్రీశుఁ డట్టి మహితుఁ దెలఁతు. 1

అర్జునున కాజి సారథ్య మాచరింపఁ
గుదిరి గీతామృతమ్మును బిదికి పేర్మి
ముజ్జగమ్ముల కుపకారమును బొనర్చె
నెవ్వఁ డా కృష్ణపరమాత్మ కివె ప్రణతులు. 2

బాదరాయణమౌనీంద్ర! వ్యాస! ఫుల్ల
పద్మపత్రసన్నిభనేత్ర! ప్రణతి నీకు,
రమ్యభారతతైలపూర్ణమ్ము జ్ఞాన
దీపమున్ నీవు వెలిఁగించితివి మహాత్మ! 3

ఎల్ల యుపనిషత్తులు గోమతల్లు లెలమి
చిందఁగా దోగ్ధ గోపాలనందనుండు,
దూడ పార్థుఁడు, భోక్త బుధుండు మధుర
మైన దుగ్ధసారమ్ము గీతామృతమ్ము. 4

భారతామృతసారసర్వస్వ మనుచు
విష్ణుముఖతీర్థముననుండి వెడలి విమలి

నంబు గీతాఖ్యగంగోదకంబుఁ ద్రావు
నెడఁ బునర్జన్మ మనుమాట తడఁబడును. 5

అనుదినమ్ము జలస్నాన మాచరింప
మనుజులకు దేహమల మదిమాత్ర మాయు,
నొక్కమాఱు మునుంగ గీతోదకమునఁ
బ్రబలసంసారమలము సర్వము నడంగు. 6

అనుదిన మనుసంధానం
బొనరించెదనమ్మ! నిన్ను నుగ్రోగ్రభవాం
బునిధిద్వేషిణి! యమృత
త్వనిధాన! రసప్రపూత! భగవద్గీతా! 7

ఓమ్

# శ్రీమద్భగవద్గీత

## మొదటి యధ్యాయము

### అర్జున విషాద యోగము

శ్రీసంతతముగ వేద
వ్యాసమహామునికృపాసమాసాదితవా
గ్వ్యాసుఁడు వైశంపాయనుఁ
డాసన్ జనమేజయునకు ననె నీసరణిన్. 1

విని కౌరవపాండవభీ
జనకసమీకోద్యమంబుఁ జయ్యనఁ గలఁకన్
మునిఁగి ధృతరాష్ట్రుఁ డిట్లని
యను సంజయుదెస మొగమ్ము నడరింపఁగనై. 2

ఒక మొగి ధర్మక్షేత్ర
మ్ము కురుక్షేత్రమునఁ బోరఁ బోయిరిగద మా
మకులును బాండవులును, నో
డక యే మొనరించినారొ డాఁపక చెపుమా. 3

అనఁ జీకుదొరకు సంజయుఁ
డనె, వ్యూఢం బైన పాండవానీకంబుం
గని దుర్యోధనుఁ డపు డా
య్యన ద్రోణాచార్యు దరియ నరిగి యిటు లనెన్. 4

నీ తెకోవిదుండు నీదుకూరుచుశిష్య
వరుఁడు ద్రుపదసుతుఁడిపన్నుగడల
బలసి గండు మిగులు పాండవసేన నా
చార్యవర్య! కంటె? సాగ నిదిగో. 5

పెనఁగ నిలిచి రిందు భీమార్జునుల కెందుఁ
బోరఁ బిసరు దీసిపోని కడిఁది
విండ్ల బిరుదుమగలు, విరటుండు, యుయుధానుఁ,
డల ద్రుపదుఁడుఁ, గన మహారథికులు. 6

శ్రీయుతుఁడు ధృష్టకేతుఁడు, చేకితానుఁ,
డాశలం గెల్వఁగల జోదు కాశిరాజు,
ఘోరబలశాలి పురుజిత్తు, కుంతిభోజుఁ,
డంతకాంతకుల్ శైబ్యవిక్రాంతవిభులు. 7

అల యుధామన్యుఁ, డుత్తమౌజుఁడు, సుభద్ర
కన్నకానుపు, ద్రౌపదికడుపుపంట,
లేల వారు వీ రని వ్రేళ్ళ చాల ముడువ?
నందు నున్నవారెల్ల మహారథికులె. 8

ద్విజకులాగ్రణి! మన తెగఁ బేరు గన్న
యట్టి ఘటికుల వివరింతు, నవధరింపు,
దండనాయకులందు నుద్దండులైన
వారిఁ గొందరఁ బేర్కొందుఁ బేరఁ దెలియ. 9

నీవు, భీష్ముఁడుఁ, గర్ణుఁడు, నిరుపమబల
శాలి కృపుఁడు, నశ్వత్థామ, శౌర్యఖని వి

కర్ణుఁడు, జయద్రథుండును, గలవ గెలువ
నాకునై నడుములు గట్టినారు, సరియె. 10

తక్కఁగల యుక్కుముక్కలు
పెక్కురు కత్తులు కటార్లు విండ్లుం గొని నా
దిక్కునన నిలిచి, రసువులు
లెక్కింపరు, వారు సమరలీల! నజయ్యాల్. 11

అనఘ! భీష్మాభిరక్షిత మయ్యు మనబ
లం బపర్యాప్త మనియే తలంతు, మంతు
లెసఁగ భీమాభిరక్షిత మెదిరిబలము
వెన్నుదీయదు, పర్యాప్త మన్నిగతుల. 12

అని, దుర్యోధనుఁ డాచా
ర్యుని మోమున మాఱుమాట యొకటియు వినరా
మి, నెలుం గెత్తి బలమ్ములు
విన నిటు శాపించె రసము వెల్లివిరియఁగాన్. 13

"తలకొని మీ రెల్లరు నేటి
నిలిచి యథాభాగ మింక నిఖిలాయనభూ
ముల రణభీష్ముని భీష్ముని
బలువుగఁ గాపాడుకొనుఁడు, పడకుఁడు పొరలన్." 14

అంత, వానికి నెంతయు సంతసమ్ము
కూర్చుచుఁ బ్రతాపతపనుఁడు కురుపితామ
హుండు సింహనాదము సేసి, గుండె లవియ
నదిరిబలములకున్ సంకు నెత్తి యూఁదె. 15

వ్వాని మొరయింపఁబడి శం
ఖానక గోముఖ పణవ మహాకాహళ భే
రీ నాదంబులు తుములము
లై నిండె నభోంతరముల నాసమయమునన్. 16

తేజునఁ బూరించిరి వెలి
తేజీలం బూన్చినట్టి దివ్యరథమునన్
రాజిలి కృష్ణార్జును లవు
మోజున నవ్వేళ దివ్యముల శంఖములన్. 17

పాంచజన్యమ్ముఁ బూరించెఁ జక్రి; ధనంజ
యుఁడు దేవదత్తము నూఁదె బిట్టు;
భీమకర్ముఁడు వైరిభీముఁ డల్ల వృకోద
రుండు పౌండ్రము మ్రోఁత నిండఁజేసె;
గుంతీసుతాగ్రజుఁ డంత ననంతవి
జయనిస్వనము నాకసమునఁ బఱపె;
బోరుకొల్పిరి కవల్ సారె సారె సుఘోష
మణిపుష్పకమ్ముల మంతు వెనిచి;
ఉగ్రకోదండకరుఁడు కాశ్యుఁడు, శిఖండి,
ద్రుపదపుత్త్రుఁడు, ద్రుపదుఁడు, ద్రోవదికొమ
రులు, విరటుఁడు, సాత్యకియుఁ, బాణ్ధునిసుతుండు,
సరవి నూఁదిరి తమతమశంఖములను. 18

ఆరవ మవిరామముగా
హేరాళము ధార్తరాష్ట్రహృదయగుహాంత

ద్వారమ్ముల దారుణగతి
దారించెన్ మాఱు వలుక ద్యావాభూముల్. 19

అంత దారుణరణభూమి నాయితు లయి
నిలిచియున్న యా ధార్తరాష్ట్రులను గాంచి,
యంపవానలు సాగునయ్యవసరమునఁ
గ్రీడి విల్లెత్తి యనె మురరిపున కిట్లు. 20

అని దుష్టాత్ముఁడు ధార్తరాష్ట్రునకు సాయంబుం బ్రియంబుం బొన
ర్ప నిచోఁ జేరిరో యెవ్వ రెవ్వ, రెవ రేభాగంబులన్ నిల్చిరో,
పెనఁగంగావలెనో యెవారి కెదురై వెన్నిక నే నింకఁ, ద
జ్జను లేపూనికి నాయతంపడిరొ, పెల్చం గన్గొనంగావలెన్. 21

కనులకు-నందుబాటు లయి, కజ్జముచొప్పను సిద్ధయించుకో
ననువుగ, నెల్లదాయల యథాస్థితులం బరికింప వీలుగా,
వనరుహపత్రనేత్ర! యిరువాగుల సేనలమధ్యభూమి స్యం
దనమును మామకీనము నుదారగతిన్ నడిపించి నిల్పుమా. 22

అన నట్లే యని తేరు ద్రోలి, బలమధ్యక్షోణిలోఁ దార్క్ష్యవా
హనుఁడున్, భీష్ముఁడుద్రోణుఁడుంగృపుఁడుమున్నౌవారుసర్వావనీ
పనికాయమ్మును, మ్రోల నగ్గమపుత్రోవన్ నిల్పి, మెల్పార, న
ర్జున! పోరం జనుదెంచినారు కురువీరుల్ వీరిఁ గన్గొ మ్మనెన్. 23

ఆతఱి నర్జునుండు గనె నయ్యిరువంకలయందుఁ దండ్రులన్
దాతలఁ బూజ్యులన్ గురులఁ దమ్ములనన్నలఁ బుత్త్రపౌత్రులన్
మాతులులన్ సుహృద్వ్యసులమామలమిత్రులఁ గూర్చుబావలన్
జ్ఞాతులఁ దెంపు సేసి ఘనసంగరదీక్షఁ గడంగువారినిన్. 24

వారలఁ గన్నారం గని
వారవికారావిమిః దిరమ్ముపడిన యెడందన్
సారెఁ దాడించబడుచుఁ బాంథుకు
మాయఁ డిబుల్ వలికె యడుకుమారునితోడన్. 25

ఘోర సమకట్టె యిటు లరుదేరినట్టి
పేరి నావారిఁ గన్గొంతఁ బ్రిదిలి సడలు
చున్న వవయవమ్ములి, వెండుచున్న యద్ది
నోరు, పొడమె మేన వడంకు, వారిజాక్ష! 26

కంటకిత మయ్యెఁ బులకలఁ గంచుకితము
దేహ మాపాదమస్తము, దేవదేవ!
గాండివము జారుచున్నది కరమునుండి,
యుడికిపోవుచున్నది చర్మ, మురక కృష్ణ! 27

ఇంక నిలఁజాల నిముషమయేని, మతి భ్ర
మించుచున్నటు లయ్యెఁ, గాన్పించుచున్న
వవిగో విపరీతశకునమ్ము, లాహవమున
స్వజనులం జంపి శ్రేయమ్ముజాడఁ జూడ. 28

కోర నే నింక గెలుపులు పోరితమున;
వలదు రాజ్యమ్ము, సుఖములు వలదు వలదు;
ఏల రాజ్యమ్ము గీజ్యమ్ము? నేల భోగ
ములురు? నేల జీవితములు? నలిననాభ! 29

అర్యమతేజ! యెవ్వరికినై మహీరాజ్యము భోగభాగ్యముల్
ధుర్యత మీఱఁ గోరఁబడి తోఁచెనో, చేరిరి వార లెల్ల రా

చార్యులుఁదండ్రులున్ సుతులుజ్ఞాతులుఁదాతలుఁజుట్టపక్కముల్
క్రౌర్యము వెంచి యీకలనఁ బ్రాణములున్ ధనముం ద్యజింపనై
ముప్పిరిఁ గొన్నపన్నుగడ ముమ్మర మైనరుషాప్తి వీరు న
న్నిప్పుడు చావమోఁద జతనింతురుగాక, ప్రతిక్రియం జెయిం
డ్రిప్పఁ ద్రిలోకరాజ్య మెయిదిం జెయిఁ జిక్కఁగనున్న, నన్న, నీ
చప్పిడినేలరాసిరికిఁ జాతునె యట్టులు కట్టివేలుపా ! 31

ధార్తరాష్ట్రుల బలివెట్టి తాల్మి మనము
బావుకొనఁగల ప్రీతి యేపాటిదయ్య !
ఆతతాయుల వీరల నడఁచిమడఁప
మనకుఁ దక్కును పాపమే మానఁబోక. 32

కానఁ, గావలసినబంధుగణముఁలోని
వారు ధృతరాష్ట్రుకొడుకులఁ బట్టి చంప
మనకుఁ బోలదుసుమ్ము: స్వజనుల నూడ్చి
పుచ్చి యచ్యుత ! సుఖమును బొందు టెట్లు ? 33

ఇచ్చిపుచ్చుకొన్న యీలగ్గద్దతనానఁ
గూళ లవుచు వీరు కులవినాశ
కృతము పెద్దదోసఁగువితము, మిత్రద్రోహ
పాప మరయఁ బాలుపడరుగాక. 34

తెలిసి కులనాశనమ్మునఁ
గలుగునసర్థమ్ము లెన్న కడుఁగడు దవులన్
నిల మన కేటు లీపాపము
వలనినివారణము తెలియువలనునఁ బడదో ! 35

కులసంక్షయమ్మునఁ గలుగు సనాతన
కుఁ ధర్మములకెల్ల గొప్ప ముప్పు;
ధర్మమ్ము రూపఱుతనుపరి పోరి నధ
ర్మ మ్మెల్లకులమును గ్రమ్మివేయుఁ;
దవులునధర్మాభిభవమునఁ జెడిపెలై
కులకాంత లాఱడిఁ గుడుచువారు;
కులకాంతలు పథమ్ముఁ దొలఁగ వర్ణమ్ముల
కట్టడ క త్తరిఁ గలిసిపోవు;

సంకర మ్మది కుల మూఢ్చజనులఁ గులము
నారకమ్ములదారికి నలిని నీడ్చుఁ;
దుదకుఁ బిండోదకక్రియల్ దూర మగుడుఁ
గులకులఘ్నులపితరులు గూలువారు. 36

వర్ణసాంకర్యమును గూర్పఁ బాలుపడిన
యీకులఘ్నులదోసఁగుల యేపుచేతఁ
దుడిచివేయఁగాఁబడు మొదల్ దడవి శాశ్వ
తమ్ము లవు నెల్ల కులజాతిధర్మములును. 37

నందసుత! సన్నగిలి త్రెస్సిన కులధర్మ
సూత్రములు గలిగిన మనుజులకు ఘోర
నరకకుండములందుఁ గాఁపురము తప్ప
నిసరి కలకాల మనుచున్ వినికిగదయ్య! 38

హరిహరీ! మన మెంత దుర్భరము పాప
కర్మ మాచరింపఁగ నొడిగట్టినాము!



రాజ్యసుఖలోభ మెడఁదలఁ గ్రమ్మువారఁ
దోడికండలఁ దెగఁగోయఁ దొడఁగినాము ! 39

వినుము కృష్ణ ! నే వి ల్లెక్కువెట్టి యిఁకఁ బ్ర
తిక్రియకు దొరంకొన; నట్టి తెఱఁగుఁ జూచి
ధార్తరాష్ట్రులు నను దాఁకి యార్తిఁ ద్రోతు
రేని సేమమ నా కది యెంతయేని 40

అని పలికి శక్తి వగపున
మునిఁగినమదిఁ గలఁగి శలన ములుకులు విల్లున్
మునుకొని యావల నిడి, యో
జనవల్లభ ! తేరుపైనిఁ జదికిలఁబడియెన్. 41

ఇతి మొదటి యధ్యాయము.

# రెండవ నధ్యాయము

## సాంఖ్య యోగము

అటులు కరుణఁజేసి యాకులమ్ములు కనుల్
నిండునశ్రుధార గుండె జాఱ
నడలి బడలుపడెడు నర్జునుఁ గనుఁగొని
పలికె నిటులు శౌరకులవిభుండు. 1

అర్జునా! యార్యులకుఁ బోల, కష్టమై సు
వర్గపదవికి, నపకీర్తిఁ బయిని మోపు
కశ్మల మ్మిది యెటనుండి కదలివచ్చి
యిట్టి విషమస్థితిన్ నినుఁ జుట్టుముట్టె! 2

ఓధనంజయ! క్లైబ్యము నొందఁబోకు,
మీ తెఱఁగు నీకుఁ బోల దొకింతయేనిఁ;
పార్థ! క్షుద్రమా హృదయదౌర్బల్య మింక
నెడలనడఁపుము, లెమ్ము, యత్నింపు మనికి. 3

అనఁ బాండవుఁ డనుఁ గృష్ణా!
పెనఁకువ గఱి సేసి పూజ్య భీష్ముని ద్రోణుం
గొని యేసి పెద్ద పలుగులఁ
జెనకెడునలుఁగులను నెటులు సిలుఁగుల నిడుదున్? 4

ఒలసి మహానుభావుల గురూత్తములం బొలియించుకన్న భూ
తలమున బిచ్చ మెత్తుకొని దాని భుజించుట లెస్స, యర్థకా
ముల గురుసోముల గెడపఁ బూనితిమా, యిహామందమందతన్
బలు వఱి నెత్రుకూళ్ళు కుడువన్ వలయుంగద ఓగదాధరా! 6

ఈయిరుభంగులందు మన కేయది మేలొ యెఱుంగ; మాయతం
బీ యనిలోన గెల్పు మనదే యవునో, మఱి వారి దౌనొ, యే
చాయ నిరూపణం! బెవరిఁ జంపి యిలన్ బ్రదుకం దలంపఁ బో
మో యల ధార్తరాష్ట్రులును నోఁచని నిల్చిరి మ్రోల నల్లదే.

అలఁతిం గొన్నదొసంగుఁ జేసి వికలం బౌటన్ స్వభావంబు నేఁ
దెలియన్ నేరక ధర్మువున్ జడుఁడ నైతిం, బ్రీతి నిన్నేఁడుచుం
టి, లతాంతాయుధుగన్న తండ్రి! యెది యోనిక్కంబుగా శ్రేయమిం
దుల, బోధింపు, మనుగ్రహింపుము ప్రపన్నున్ నన్ను నీశిష్యునిన్

తెలియ నకంటకమ్ము జగతీతలరాజ్యముఁ బ్రాజ్యముం గొనం
గలిగిననైనఁ, బూని వెయికన్నులవానిపురమ్ముఁ జేతిలో
నిలుపుకొనంగ నేర్చినను, నీరజలోచన! యింద్రియాళికిం
గలపనఁబిండి నానెగులుఁ గ్రన్న నెడల్చి తెమల్చు పద్ధతిన్. 8

అని పలికి హృషీకేశుఁడు
వినఁగ, గుడాకేశుఁ, డింకఁ బెనఁకువకున్ ము
నొక్కన, నిక్కువ మిది, యని, స్వం
దనమునఁ దా మిన్నకుండె ధరణీపాలా! 9

అంధరాజ! వింటె! అటు రెండుబలముల
నడుమ చేష్టఁ దక్కి గొడువఁ గుడుచు

పార్థుఁ జూచి పలికె భగవానుఁ డల్లన
నవ్వుచున్నవానినలువు దోఁప. 10

వగవఁ దగనివారలఁ గూర్చి వగచుచుంటి,
పలుకుచుంటివి ప్రజ్ఞావివాదములను,
పార్థ! పండితు లవ్వారు వగవఁబోరు
సుమ్ము సుంత గతాగతాసువులఁ గూర్చి. 11

అర్జునా! నేను నీవు నీయవనిపతులు
నింతకున్ మున్ను లే మను టెల్ల కల్ల;
ఇంకమీఁద నైతము మన మెల్లరమును
పొరిది నుండఁబో మనుచొప్పు సుద్దతప్పు. 12

వారక దేహముం గొనినవానికి దేహమునందు నెట్లు కౌమారము జవ్వనమ్ము జర మానక మాటికిఁ గల్గుచుండు, నా తీరున నేనుమా మఱొక దేహముపొందికకూడఁ గల్గు; నీ తీరు నెఱుంగనేరిచిన ధీరుఁడు మోహము నొందఁ డియ్యెడన్.

తలఁపఁగ మాత్రాస్పర్శ
మ్ములు శీతోష్ణసుఖదుఃఖములఁ గౌంతేయా!
కలిగించు, నడుకువిఱుపులు
గలవి, యనిత్యములు; వానిఁ గడు నోరువుమా. 14

సుగమున దుక్కమ్మున నొక
టిగ వర్తిలుధీరు నెవని డింపఁగ వ్యధలం
దగవో యవి, యామహితుఁడు
మొగి నమృతత్వమ్ముఁ బడయుపోడిమి కగుఁజూ. 15

విను కిరీటి! అసత్తున కునికి లేదు,
సత్తునకు లేమియే లే దసంశయముగ;
నెఱపియున్నార లీరెంటినిర్ణయమును
దత్త్వదర్శులు లెస్సగఁ దడవిచూచి. 16

ఈ పరిదృశ్యమాన మగు నెల్లజగమ్మును దేనివ్యాపన
శ్రీపరిపాటిఁ బేర్మి విలసిల్లుచునున్నదో, అద్ది యెుక్కఁగుం
డే పురుహూతసూతి! నశియింపని దంచు నెఱుంగు; మవ్యయం
బై పరమంబు దీనికి వ్యయంబును గూర్పఁగ లేఁ డెవాఁడునున్.

నిత్యంబై, యవినాశియై, యొకటులున్ జ్ఞేయంబు గాకుండఁగాఁ
బ్రత్యక్షాదికముల్ ప్రమాణములచే, భాసిల్లుతద్దేహికిన్
సత్యశ్రీక! పొసంగు దేహము లి వెస్సన్ నాశవంతంబు లం
చత్యంతంబు బుధుల్ వచించి; రనికిన్ యత్నింపుమా నీ విఁకన్.

పార్థ! ఈ దేహినిం జంపువానిఁగాఁగఁ,
జంపఁబడినవానినిఁగాఁగఁ, జాల తలఁచు
వార లిరువురుఁ దెలియనివార; లితఁడు
చంపఁడున్ వేనిచే నెప్డుఁ జంపఁబడఁడు. 19

పొడమ దీయాత్మ యెుకపుడు; మడియ; దుండి
పెండి యుండనిదియుఁ గాదు; బెరసి చావు
పుటుక హెచ్చు గుందును లేదు; పొరయుచున్న
మెయి వికారమ్ము, విపరిణమింపఁబోదు. 20

అడఁగుఁ గొనఁబోదు, నిత్యము, పొడమఁబోవ,
దవ్యయం, బని యీయాత్మ నరసి లెస్స

యెఱిఁగికొన్నాతఁ డెవ్వని నెట్లు చంపు?
నెట్లు చంపఁ బ్రేరేచు? వచింపుమయ్య! 21

చినిఁగిపోయిన ప్రాఁబట్టలను త్యజించి
జనుఁడు క్రొత్తవానిని వేఱె గొనెడుభంగిఁ,
జెడినజీర్ణదేహమ్ముల విడిచి దేహి
క్రొత్తవానిని మఱివేఱె గొనుచునుండు. 22

వాఁడికత్తు లీదేహిని గాడి వెట్టి
నఱుకఁగా నేర, వగ్గి మంటల దహింప
లేదు, నీళులు తడుపఁగా లేవు, గాలి
వీఁచి యెండింపఁజాలదు; వినుము పార్థ! 23

తెవిరి ఛేదింపఁ గాల్ప నార్ద్రీకరింప
నెండఁజేయ నేరని దాత్మ, యింత నిర్ణ
యమ్ము; నిత్యము సర్వగతమ్ము స్థాణు
వచలము సనాతన మ్మిది యర్జునుండ! 24

గోచరింప దింద్రియములకును మనస్సు
నకును, నవికార్య, మాత్మ యనంగఁబడియె
సూరిజనులచే; దాని నాదారి నెఱిఁగి
కొనిన, శోకింప నర్హతఁ గొనవు నీవు. 25

అట్లు గాక, యెల్లప్పుడును నాత్మ పుట్టు
నదియు గిట్టునదియు నని మదిఁ దలంచి
నమ్మెదవ యేని, నప్పుడును, నలువు దప్పి
యిప్పగిది వగఁ బొగులఁగా నొప్పఁబోవు. 26

పుట్టువానికి గిట్టును, గిట్టు నెల్ల
దానికిం బుట్టును, ధ్రువమ్ము; తప్ప దింత:
ఆ ట్లవుటఁ బుట్టుచావుల నపరిహార్య
మైనదానిఁ గూరిచి వగఁ బూన నగునె? 27

పొదలి యెల్లభూతములకు మొదలు దెలియఁ
బడదు, నడిమికాలముమాత్ర వ్యక్త మగును;
తుది యెఱుంగ రానట్టిద కద; ధనంజ
య! యిఁక వానికై దేవురులాడ నేల? 28

అచ్చెరు వైనదానినిఁగ నాత్మను నొక్కఁడు చూచు; వేఱొకం
డచ్చెరు వైనదానినిఁగ నచ్చెరు వొందుచుఁ జెప్పు; నెంతయే
నచ్చెరు వైనదానినిఁగ నన్యుఁడు వీనుల నాలకించు; నీ
యుచ్చిన విన్న, దానిఁ దెలియంగలవాఁ డొకరుండు లేఁడుసూ.

సర్వప్రాణులదేహమం దొలసి యోజన్ మీఱునీదేహి, యా
సర్వప్రాణులు వధ్యమానగతి నాశం బందినం బార్థ! తా
సర్వావస్థలయం దవధ్యుఁ, డిది సాక్షాత్సత్య: మట్లౌటచే,
సర్వప్రాణులఁగూర్చి యార్తిఁబడ లేశంబైన నర్హుండవే? 30

అంతియ గాక, లెస్స మది నారసియైన స్వధర్మవైఖరిం,
జింతిలి కంపనమ్ము మెయిఁ జెల్లదు కగ్గముఁ జెల్లఁబెట్ట నీ;
కింతయు ధర్మవున్ విడక యెంతయు ధర్మవు పోరుకంటె నో
కుంతిసుతుండ! క్షత్రియునకుం గనరా దొక శ్రేయ మేమెడన్.

కోరక తటిసినత్రిదివ
ద్వారమ్మనటుల్ గాని సుఖపడువారు మహా

శూరులు క్షత్రియవీరులు
పోరితమును నిట్టిదానిఁ బురుహూతసుతా! 32

అద్ది యట్టు లుండె, నర్జునా! ధర్మ్యమీ
యుద్ధమునకుఁ గడఁగకుందువేని,
మొదలు వో స్వధర్మముం గీర్తినిం గోలు
పోయి పాపగతినిఁ బొందఁగలవు. 33

అఖిలభూతమ్ములును నీదునపయశమ్ముఁ
గూడి కలకాలముం జెప్పుకొనఁగఁగలవు;
వాసి వన్నియ గన్న సంభావితునకు
నపయశము చావుకంటెను నధికతరము. 34

పోర వెఱచి జాఱిన వాఁడుబోఁటు వనుచుఁ
జెప్పుకొంద్రు మహారథుల్ చేరి నిన్ను;
నిన్న మొన్నటిదాఁకను మిన్నవైన
నీవు చులుక నౌదువు వారిభావములకు. 35

నిన్ను నీమగఁటిమిని నిందించి తూరు
పారఁ బట్టుచుఁ బలుకరానట్టి పలుకు
లుఱక పలుకువారలు నీపగఱు, కిరీటి!
తోఁచునే యంతకంటెను దుఃఖతరము! 36

కెడఁవఁబడుదువా, స్వర్గమ్ముఁ బడయఁగలవు;
గెలుతువా, వసుంధర నేలఁ గలవు లెస్స;
అట్లు కావున, లెమ్ము, కయ్యమున కింక
నడుము గట్టుము, పట్టుమా కడిఁదివిల్లు. 37



కడలుకొన్న సుఖమును దుఃఖమును, లాభ
మును నలాభమున్, గెలుపును మొనయునోటు,
నొకటి గావించి కడఁగుమా యుద్ధధర్మ
మునకు; నాదారిఁ బాపము నెనయఁబోవు. 38

పాండవా! సాంఖ్యమందలి పరమనిర్ణ
యమును దెలిపితి, నింక యోగమునబుద్ధి
తెఱఁగు నాలకింపుము; దాని తెరువు విడక
నడచి కర్మబంధముఁ ద్రోసియిడఁగఁ గలవు. 39

కన, నభిక్రమనాశమ్ముగాని, ప్రత్య
వాయముంగాని, లే దిందు; స్వల్ప మయ్యుఁ
బ్రబల మీ ధర్మలేశమ్ము రక్షవెట్టి
పెద్దసంసారభయమును వెడల నడఁచు. 40

ఇవురింపం దమి శ్రేయముం గొనఁ బథమ్మొ కర్మమార్గమ్మునన్
వ్యవసాయాత్మికమైన బుద్ధి యొకఁడే భాసిల్లుఁ బేర్మోసి; పాం
డవ! ప్రాపింపక నిశ్చయాత్మకము జ్ఞానం బల్పు లావారిబు
ద్ధివికారంబు లనంతముల్ బహులముల్ తెక్కొన్నతచ్ఛాఖలున్

వేదమ్ములం దర్థవాదవాక్యము లూఁత
గా వాదములు సేయఁ గడఁగువారు,
తవిలి కామమ్ములఁ దల మునింగినవారు,
స్వర్గమే పర మంచు సాగువారు,
గతి లేదు కర్మమ్ముకంటె వే ఱనువారు,
కడు వివేకము లొచ్చువడినవారు,

పలుకుచుందురు రేవేలఁ, బడయ భోగైశ్వర్య
ములసాధనమ్ముగ మొనయ నేర్చి

వింతవింతలు క్రియల వేవేల వెలసి,
జన్మమే కర్మఫలముగాఁ జాటి యొసఁగి,
పూవు పూఁచిన తరువట్లు పొలిచి, చెవుల
విందువుగ ఫలమ్ములఁ దెల్పఁ బలుకుఁ బడుల. 42

కాంక్ష లెసఁగ భోగైశ్వర్యగతులఁ దవిలి
తదపహృతచిత్తులకు నెదఁ బొదలఁబోదు
సాంఖ్యమందో, యోగమునందో, చాల రూఢిఁ
గన్న నిశ్చయభావమ్ము కర్జి! వినుము. 43

పాండవ! వేదములందు న
కందుగ నిండారి కర్మకాండము నొడువున్
గందున సంసారము, నీ
వుండుము నిష్కామతాధియోగనిరూఢిన్. 44

ఎడమగుమా ద్వంద్వమ్ముల,
కెడపక సత్త్వమ్ము నాశ్రయింపుము, కొనఁగా
నుడుగుము యోగక్షేమము,
లడరింపుము యప్రమత్తతానుభవమ్మున్. 45

కొలఁదినీటిపట్టునఁ గల్గుఫల మదెల్లఁ
బెద్దనీరువామిని లెస్స బెరయుమాడ్కిఁ
బార్థ! పరమార్థ మెఱిఁగిన బ్రాహ్మణునకు
సర్వవేదలాభము కైవసంబ యవును. 46

కర్మమునయందె యర్హత గలదుగాని,
ఫలములం దెన్నఁడును లేదు పార్థ! నీకుఁ;
గర్మఫలలిప్సకుం గుఱి గాకు; మట్టు
లని, త్యజింపఁ గర్మమ్ముల మనసుపడకు. 47

కవ్వడీ! ఫలమ్ములయాసఁ గడకుఁ ద్రోసి,
యోగనిష్ఠుఁడవై, చూచు చోకఁడు గాఁగ
సిద్ధ్యసిద్ధులఁ, గర్మముల్ సేయుమయ్య;
ఆ సమత్వమే యోగాఖ్య నతిశయిల్లు. 48

ప్రకటనిష్కామకర్మమ్మునకు, నికృష్ట
కామ్యకర్మమ్మునకుఁ జాల గలదు దవ్వు;
కాన, సాంఖ్యమో కర్మమో పూని మనుము;
ఫలములను గోరువారు చేడ్పడెడువారు. 49

ఈ సమత్వబుద్ధి గలాతఁ డిహమునంద
పుణ్యముం బాపమున్ రెంటిఁ బోఁ ద్యజించుఁ;
గాన, జతనింపు బుద్ధియోగమ్ముకొఱకు;
యోగ మనఁ గర్మకౌశల మురుగుణాఢ్య! 50

బుద్ధి సుసమృద్ధిగాఁ గొన్న బుధులు కర్మ
ములవలనఁ బుట్టుఫలము లవ్వలకు నెట్టి
జన్మబంధవిముక్తులై శాశ్వత మ్మ
నామయమ్ము పద మ్మొసయంగలారు. 51

మొనసి యేనాఁడు నీబుద్ధి మోహకలిల
మును దరింప నేర్చునో, నాఁడు పొందఁగలవు

వినఁదగినదానియెడలను, వినినదాని
యెడలనుం జెందని ర్వేద మీవు పార్థ! 52

పలుతెఱఁగులకర్మఫల
మ్ములవినుకలిఁ గలఁగి నీదుబుద్ధి యెపుడు ని
శ్చలమై సమాధిఁ గదలక
నిలుచు, నపుడు యోగముం గొనెద వీ వెలమిన్. 53

అనిన విని ఫల్గునుం డను, నంబుజోద
రా! సమాధినిష్ఠుఁడు స్థితప్రజ్ఞుఁ డైన
వానితెఱఁ గేది? యతఁ డేది వలుకు? నాతఁ
డెటులు గూర్చుండు? నెటులేగు? నింత చెప్పుము. 54

అంత శ్రీభగవానుఁ డనె నిట్లు, కౌంతేయ!
మనమునఁ దోఁచుకామముల నెల్ల
వడివడి విడనాడి బాహ్యలాభాపేక్షఁ
జెనయక తనయందె తనకుఁదాన
పరమసంతోషానుభవమున నోలాడు
వాఁ డెలర్చును స్థితప్రజ్ఞుఁ డనఁగఁ;
బ్రాపింపనీ యెన్ని పాయనిదుఃఖముల్
క్షోభిల్లఁ డాతఁడు నుంత మదిని;
సుఖములెడ నెట్టి గోరికఁ జూపఁబోఁడు;
మెలఁగఁబోకుండఁ దనచూపుమేరలోన
రాగభయకోపములకు దూరాయి గట్టి,
మననశీలుఁడై యుండు నామహితమూర్తి. 55

కొనక కన్నిట స్నేహమ్మును,
గొన నయ్యును మంచి చెడుగు గొనక ప్రతోప
మ్మును ద్వేషమ్మును, నెవ్వఁడో
దినయాతనిప్రజ్ఞ సుప్రతిష్ఠిత పార్థా! 56

హేలమై నిజాంగములఁ దాఁబేలువోలె
నింద్రియార్థంబులనయుండి యింద్రియముల
నెల్ల నెల్లరీతుల మరలించుకొనఁగ
లాతని వివేకము స్థిర మటంచు నెంచు. 57

విషయములన్ గ్రహించుపనిఁ బెట్టని యచ్చపు దేహధారికిన్
విషయములన్నియున్ మరలు వేగమ రాగము నిల్వరించి; పూ
రుషవరుఁ డీయతీశ్వరునిప్రోఁపున రాగముసైతమున్ బల
ద్విషునితనూజుఁడా! సమయుబీజముతోడుతఁ, జూచియాత్మమున్
జతనము సేయుచున్ విడక, జ్ఞానము లెస్సగఁ గల్గియున్న ధీ
యుతునిమనమ్మునేని పెనుపొందుగలంతఁ గలంచి ముంచి యు
ద్ధతగతి నొక్కపెట్టఁ బెడదారుల కీడిచి మాడ్చివేయు నా
యతినిఁ బ్రమాథులింద్రియ చయంబులులోఁగొనితత్ప్రవృత్తిసన్.

కాన నరికట్టి యింద్రియగణము నెల్ల,
యుక్తుఁడై మత్పరుం డయి యుండవలయు;
నెవ్వనికిఁ గైవసంబులో యింద్రియంబు,
లతఁ ప్రజ్ఞ ప్రతిష్ఠిత యర్జునుండ! 60

విడువక శబ్దాదివిషయవిశేషాను
చింతనమ్మున ముగ్గి యంతు గనని

వానికి వలని వస్త్వాదిపై నెంతయుఁ
దవులాట మిప్పరెత్తి తవులుకొనును;
అద్దానికతమున నడరును గామమ్ము;
కామమ్మునం గ్రోధకలన లోదవుఁ;
క్రోధమ్మునం బుట్టి కుముకుగట్టును నవి
వేక; మద్దానిదౌ పేఁకవలనఁ

గలుగు స్మృతినాశ; మద్దానికతనఁజేసి
తొలఁగిచనును గార్యాకార్యములగుఱుతుల
యెఱుక; యాకారణమ్మునఁ దెఱఁగు దప్పి
మానవుం డర్థముల కెడయై నశించు. 61

పాసి రాగమున్ ద్వేషమున్, వశముపడిన
యింద్రియమ్ములతోడఁ జరింపఁ దొడరి
విషయముల మెలంగుచు నున్న బెరయఁగలఁడు
స్వాస్థ్యమును వశి యగువాఁడు పార్థ! లెస్స. 62

స్వస్థమై చిత్తము ప్రసన్నభావ మొందుఁ,
దొలఁగు నీయతీశున కెల్లదుఃఖములును;
సుప్రసన్నచిత్తునిబుద్ధి క్షిప్ర మాత్మ
రూపమున నిశ్చలత నొంది యేపు మీఱు. 63

అవశికిన్ బుద్ధి కలుగఁబో, దట్టివాని
కసలె పొసఁగ దాత్మజ్ఞానమందు నభిని
వేశ; మది లేనివానికి బెరయు దెంత
శాంతి; శాంతిహీనున కెట్లు సౌఖ్య మబ్బు? 64

ఎలమి స్వస్వవిషయముల మెలఁగునింద్రి
యముల ననుసరించి చరించునట్టిమనసు
బరిగొని హరించు నీయతిప్రజ్ఞ నెల్ల,
ఫల్గునా! గాలి నీటిలోఁ బడవనటులు. 65

అట్లుగాన, నెవ్వనియింద్రియములు లెస్స
యింద్రియార్థమ్ములనయుండి యెల్లగతుల
నిగ్రహింపఁగాఁబడునో, యా నిష్ఠితాత్మ
ప్రజ్ఞ సుప్రతిష్ఠిత, వింటె పాండుతనయ! 66

అఖిలభూతమ్ములకు నిశ యైనదాని
యందు సంయమి మెలఁకువ నొంది యుండు;
మేలుకని యెల్లభూతముల్ మెలఁగువేళ
యాత్మముం గన్నమునికి నిశావసరము. 67

లలిని నింపి యెల్లెడ నచలప్రతిష్ఠ
మైనసాగరమ్మున నీళులట్లు తెల్ల
కోర్కె లెవనియందునఁ జొరుఁ, గొను నతండు
మోక్షమును; గామకామి యామొగికిఁ గాఁడు. 68

విడిచిపుచ్చి కామములెల్లఁ, దుడిచి స్పృహను,
మమతఁ దొలఁచి, యహంకృతి సమయ ద్రుంచి,
ముక్తసంగుఁడై, యెవ్వఁడు పుడమిఁ దిరుగు
నతఁ, డా స్థితప్రజ్ఞుఁడు శాంతిఁ బడయు. 69

ఇది బ్రాహ్మిస్థితి; సుస్థితి
నిది పొంది బుధుండు మోహ మెనయఁడు; తుదిదా



వదనునసేనియు నిందున్
నిదానమున నిలిచి బ్రహ్మనిర్వృతిం బడయున్. 70

ఇది రెండవ యధ్యాయము.

# మూఁడవ యధ్యాయము

## కర్మ యోగము

అనిన విని ధనంజయుఁ డిట్టు లనియెఁ, గృష్ణ!
కర్మమునకన్న జ్ఞానమే శర్మద మని
నీమత మ్మవునేడ, నన్ను నియతి దప్పి
ఘోరకర్మమ్మునన్ డింపఁ గోర నేల? 1

తెలియ నట్టు నిట్టును గాని తెరువునఁ బడి
చాల సందిగ్ధ మవునదివోలె నున్న
పలుకు పలికి, నాబుద్ధి నీకలన మోహ
పెట్టుచున్నటు లున్నావు వేద్య! నీవు. 2

కావున నేయొకవలనున
నే వారక శ్రేయ మెనయ నేర్తునొ, కరుణం
గావించి నిశ్చయము దే
వా! వచియింపు మని వేఁడ భగవానుఁ డనున్. 3

పార్థ! యీలోకమందుఁ త్రైవర్ణికులకు
నిష్ఠ యిరు తెఱంగు లని మున్ దెలిపియుంటి;
జ్ఞానయోగమ్మునన్ లెస్స సాంఖ్యులకును,
గర్మయోగమ్మునన్ యోగిగణములకును. 4

మొదలుపెట్టక కర్మముల్ ముడుఁగుమాత్ర
నరుఁడు నైష్కర్మ్యముం బొందునరికిఁ గాఁడు;
సంన్యసించినమాత్రన జ్ఞానసిద్ధి
నొంది వెలుఁగొంద నేరఁ డమందయశుఁడ! 5

ఎన్నఁడేని నేక్షణమున నెవ్వఁడేని
నుండఁ డేకర్మమును జేయకుండ ననఘ!
ప్రకృతిజములైన గుణములవశమునఁ బడి
ప్రతియొకఁడుఁ జేయుచుండుఁ గర్మము నెవేల. 6

అరసి లోఁగొని కర్మేంద్రియముల, నెవఁడు
మనసుచే నింద్రియార్థములను స్మరించు
చుండునో, యా వివేకశూన్యుండు దాంభి
కుఁడు మృషాచారుఁ డని పేరుకొనఁగఁబడును. 7

ఎవ్వఁడు మనస్సుచేత జ్ఞానేంద్రియముల
మిన్నుల నియమించి, ఫలములఁ దవులువడక,
కడఁగి కర్మేంద్రియములతోఁ గర్మయోగ
మున మొనయునో, యతఁడు శ్రేష్ఠుఁ డనఁగఁబడును. 8

నియతమ వైన కర్మమును నీ వొనరింపఁగఁ బూనుమా, ధనం
జయ! కడు లెస్స కర్మమును సల్పమికన్న నొనర్చుచొప్పు; ని
శ్చయముగ దయ్యెయీ తెఱఁగు; సాఁగఁగఁబోదు శరీరయాత్రయే
నియు నిల నీకకర్మమున నెమ్మదిఁ జూపుదువేని సమ్మతిన్. 9

త్రిక్కక యజ్ఞపూరుషమతిం బొనరించెడుదానికన్న వే
ఱొక్కఁడు కర్మమందు జగ మొయ్యన నియ్యది యెల్లఁ గర్మచే

నెక్కటిఁ గట్టి వేయఁబడు; నిట్లవుటన్, ఫలలిప్స లేక యే
గ్రక్కున నీశ్వరార్పణముగా నొనరింపుము కర్మ మర్జునా! 10

ఫల్గునా! మును ప్రజాపతి యజ్ఞసహితుల
బ్రాహ్మణాదిత్రివర్ణముల వారిఁ
బొడమించి యివ్విధుమున నుపదేశించె-
నీయజ్ఞమున మీర లెల్ల నెగడి
యేపొందుఁ; డిది మీకు నెల్ల కామమ్ముల
నవును గా దనఁ బ్రవ్వడపుడ కురియు;
భావించుచుండుఁ డిప్పరమసాధనమున
మీరు వేల్పులఁ; బేర్మి మెఱయ మిమ్ము

వేలుపులు నెవేల విడక భావించుచు
నుండువార; లిట్టు లొండొరులను
భావ మెసక మెసఁగ భావించుకొంచుఁ బ
రమము శ్రేయ మొంది యమరఁగలరు. 11

యజ్ఞసంభావితులైన వేల్పులు మీకు
వలయుభోగంబు లవ్వారిగాఁగ
సమకూరుతురుగదా; సరవి వా రొసఁగిన
బహులభోగముల నవ్వారికొఱకె
వినియోగపఱిచి తదృణము నీఁగుతలంపుఁ
బొదలనీయక స్వార్థబుద్ధిఁ జేసి
కుడిచి కూర్చుండు వాతఁడు కృతఘ్నుఁడు, వాని
కంటెను బరికాఁడు కానరాఁడు;

యజ్ఞశేషమ్ము భుజియించు నంచితాత్ము
లెల్లపాపమ్ములం ద్రోసి యుడుగఁగలారు;
పట్టి తమపొట్ట నింపుకో వండుకొనెడు
పాపు లఘములకుడుపున బడలువారు. 12

అన్నమువల్ల భూతములు, నన్నము వానలవల్ల, వానలున్
జన్నమువల్ల, జన్నము పొసంగినకర్మమువల్లఁ, గర్మముం
బన్నుగ బ్రహ్మవల్ల, నల బ్రహ్మము నక్షరువల్లఁ, బుట్టుఁజూ;
జన్నమునన్ స్థిత మ్మెపుడు సర్వగత మ్మవుబ్రహ్మ మందుచేన్.

ఈ మెయి సంప్రవర్తితము నీశునిచే శ్రుతియజ్ఞపూర్వముం
గామము లోకచక్రమును గర్మమునం దధికారియైన వాఁ
డేమనుజుండు తా ననుసరింపఁడో, యాతఁ డఘాయు వింద్రియా
రాముఁడు నై ధనంజయ! ధరన్ మనియుండును వ్యర్థజన్ముఁడై

నిచ్చ సాంఖ్యుఁ డాత్మజ్ఞాననిష్ఠుఁ డెవ్వఁ
డాత్మరతుఁడ యై పడయుచు నాత్మతృప్తి
నాత్మమునయందె సంతోష మందు, నాతఁడు
సలుపవలసినకర్జ మేవలన లేదు. 15

పార్థ! అట్టిజ్ఞానికిఁ జేయఁబడినకర్మ
చేత లాభముఁ, జేయమిఁ జేటు, నిందు
లేదు; సర్వభూతములందు లేదు వాని
కాశ్రయింపఁగాఁ దగిన మహార్థ మెదియు. 16

కావున వసక్తుఁడవ వై
కావింపుము కర్జమైన కర్మమును సతం,

చేవాఁ డసక్తిఁ గర్మముఁ
గావించునొ, వాఁడు గాంచుఁ గ్రన్ననఁ బరమున్. 17

విను జనకాదులు కర్మ
మ్మునసే సంసిద్ధిఁ బడసి పూజ్యతఁ గాని ర
ర్జున ! లోకసంగ్రహమ్మును
గనియైనం గర్మ మీవు గావింపవలెన్. 18

శ్రేష్ఠుఁ డగునాతఁ డెది యెవి చేయ నెంచు,
నన్యజనుఁడును నదె యదె యాచరించు;
శ్రేష్ఠుఁ డెది ప్రమాణమ్ముగాఁ జేసియుంచు,
మొనసి లోక మద్దానినే యనుసరించు. 19

అర్జునా ! ముప్పాలమ్ములయందు నా కొ
కింత కర్తవ్యమే సున్న; నుంత పొంద
రానిదియుఁ గాని, పొందఁగానైనయదియుఁ
గాని లేదు; వర్తిలుచుంటిఁ గర్మమందె. 20

ఎడయఁద్రోసి నే నలసత యెన్నఁడేని
నొనరుపక కర్మమును మానియుందునేని,
యెల్లరీతుల మానవు లెల్లవారు
విడక నా త్రోవనే త్రొక్కి నడచువారు. 21

ఒనరి నేఁ గర్మమును జేయకుందునేనిఁ,
బొలము లివి యెల్ల జిల్లేళ్ళు మొలిచిపోవె !
కోరి నే సంకరమునకు దారి దీసి
ప్రజల మట్టిలోఁ గలిపినవాఁడ నవుదు. 22

అర్జునా! ఫలకాము లజ్ఞు లెట్టి
యభినివేశమ్మునం గర్మ మాచరింతు,
రట్టిరీతిఁ బ్రాజ్ఞుఁ డసక్తుఁడై పొనర్ప
వలయు లోకసంగ్రహమునఁ దలఁపు నిలిపి. 23

కర్మములందుఁ బట్టుదల గల్గిన యజ్ఞుల కెన్నఁడేని యే
మర్మము వెట్టియేని యొక మార్పును గూర్పఁగరాదు బుద్ధిలోఁ;
గర్మము లెల్లఁ జేయుచు వికారము నొందని ప్రాజ్ఞుఁ డొప్పుగాఁ
గర్మములం దలిర్చునటుగాఁ బురికొల్పవలెన్ జగంబులన్. 24

ప్రకృతిగుణములచేతఁ గర్మమ్ము లెల్ల
నెల్లపుడు నెల్లగతులఁ గావింపఁబడును;
అగునహంకారమున విమూఢాత్ముఁడైన
యతఁడు నేనె కర్త నటంచు మతిఁ దలంచు. 25

అమరినగుణకర్మవిభా
గముల తెఱం గెఱుఁగువేత్త, కన నింద్రియజా
లము మెలఁగు విషయముల, నా
త్మము గా, దని తెలిసి పడఁడు తవులాటమునన్. 26

పూని ప్రకృతిగుణవిమూఢు లైనవారు
మివుల గుణకర్మములయందుఁ దవులు గొందు;
రజ్ఞులై కర్మఫలమాత్ర మరయునట్టి
యలుపులఁ జలింపఁజేయరా దాత్మవేత్త. 27

కావున వివేకబుద్ధితోఁ గర్మములను
నెల్లఁ బరమేశ్వరునియందె చెల్లఁబెట్టి,

కోరికలు మమకారమ్ము దూరమంద
నిలిపి, విగతజ్వరుండవై కలన డీగుము. 28

నామత మైన దీనిని సనారత మీసును ద్రోసివేసి శ్ర
ద్ధామహితాంతరంగమునఁ దప్పనిచొప్పున నాచరింపఁగా
నేమనుజోత్తముల్ దమి వహింతురొ, వారలు శ్రేయమోముకో
నోముక సర్వకర్మములనుండి విముక్తిఁ గాంతు రెంతయున్.

ఇదుగడం దొడి తెగడుచు నియ్యది యిదు
కొన కనుష్ఠానమున నొప్పుకొననివారు
భ్రష్టులు వివేకమే లేని నష్టమతులుఁ
గూళలు నని లెస్స యెఱిఁగికొనుము పార్థ ! ౩0

అరయఁ దనదుప్రకృతి కనురూప మవుదారి
వ్యవహరించు జ్ఞానవంతుఁడేనిఁ;
బ్రకృతి ననుసరించి పరగు భూతము లెల్ల;
నింక నిగ్రహంబ దేమి సేయు ? 31

ప్రతియొకయింద్రియమ్మునకు వర్తిలునర్థమునందు నెందు న
ప్రతిహతమైన రూపమున రాగము ద్వేషముఁ బుట్టుచుండు; ని
శ్చిత మిది; కాన, వాని కొకచిన్నమునంతయు లోఁబడంగ రా;
దతులితతేజ! పూరుషున కాఅరిశత్రువు లివ్వి రెండునున్. 32

అగుగతి నాచరింపఁబడునన్యులధర్మముకంటె లెస్ససూ
విగుణమ యైనగాక వెయివేలుమడుంగులు స్వీయధర్మమే;
జగతి ధృతస్వధర్మమునఁ జావును మేలుఁ; విధర్మ మాయతం
బుగ నరకాదికమ్ము భయముం బొసఁగించును శ్వేతవాహనా!

అనవుడుఁ బాండురాజసుతుఁ, డంబురుహోదర ! దేని ప్రేరణం
బునఁబడి తాను గోరకయుఁ బూరుషుఁ డెంతయు నున్ బలాత్కృతిం
బానరి పాపిన్ నియోజితుఁ డువో లెఁ బానరు చునుండుఁ బాపమున్
విన వచియింపుమా, యనుచు వేఁడుకొనన్ భగవానుఁ డిట్లనున్

పాండవా ! రజోగుణసముద్భవము యిట్టి
కామముంగాని, క్రోధముంగాని, పోని
పెద్దతృష్ణతో నఘముతోఁ బెనఁగియుండు;
నిట్టి కామమ్ము పగ యని యెఱిఁగికొనుము. 35

వినుము, పొగచేత నిప్పుచొప్పునను, ముఱికి
చేత నద్దమట్టులు, మావిచేత గర్భ
మందలి శిశువుచందాన, నావృత మయి
యుండుఁ గామమ్ముచే జ్ఞాన; మురుగుణాఢ్య ! 36

ఉడుగనివగ, పూరింపం
బడునది దుక్కమునఁ, జిచ్చువంటిది, యై చొ
ప్పడు కామమ్మునఁ గప్పం
బడి యడరెడు జ్ఞానిజ్ఞానవైభవ మెల్లన్. 37

విను కిరీటి ! యింద్రియములు మనసు బుద్ధి
కామమున కైనతావులుగా వచింత్రు;
క్రమ్మ వీనితో జ్ఞానమ్ముఁ గప్పిపుచ్చి
దేహి నీ కామ మెంతయు మోహ పెట్టు. 38

ఇట్లు కావునఁ దొల్దొల్త నింద్రియముల
నెల్ల లోఁగొని నీవు త్యజింపుమయ్య

పాపపుంద్రోవలంబునఁ బదము లూఁది
జ్ఞానవిజ్ఞాననాశక మైన దీని. 39

ఇంద్రియములు శ్రేష్ఠము లెంతయేని నందు;
రింద్రియములకన్నను మన సెన్న మిన్న;
మనసుకంటె గొప్పది బుద్ధి: మఱియుబుద్ధి
కంటెఁ బరుఁడె యా పరమాత్మ; వింటె పార్థ! 40

కత్తి! యిట్టు లాత్మను బుద్ధికంటెఁ బరునిఁ
గాఁగ లెస్స యెఱింగి, లోఁ డాఁగియున్న
ప్రబలశత్రువుఁ గామరూపము దురాస
దమ్ము నరికట్టి గెలువుము మనమ్ముచేత. 41

ఇది మూఁడవ నధ్యాయము.

## నాలుగవ నధ్యాయము

### జ్ఞాన కర్మ సంన్యాస యోగము

అర్జునా! వినుము, సర్గాదియం దీయోగ
మును నే సహస్రాంశువునకుఁ బొనరు
నెనరున నుపదేశ మొనరించితి, "గడించు
క్షత్రియబలసిద్ధికారణమున
బ్రహ్మవనము లెస్స పనుపడు; నద్దాన
నఖిలజగత్క్షేమ మతిశయిల్లు,"
ననుసూహ; నినుఁడును మనువున కెఱిఁగించె;
మనువు తా నిక్ష్వాకువునకుఁ దెలిపెఁ;

బరగ నిట్లు పరంపరాప్రాప్తమైన
దీని రాజర్షు లెందఱో తెలిసికొనిరి;
కాని, యీ లోకమున దీర్ఘకాలగతి స
నాతనము యోగ మియ్యది నష్ట మయ్యె. 1

అటు పురాతనతమమైన యా యీ యోగ
మే వచించినాఁడ నిపుడు నీకు
భక్తుఁడవును నాకుఁ బరమమిత్రము నని
యది మహోత్తమము రహస్యము సుమి. 2

అనవుడు- మొన్న మొన్న నకదా వసుదేవునియింటఁ బుట్టినా
వెనుబది యేడు నేండ్లమును పీ; వుదయించెనుగాదె యెన్నఁడో
యినుఁ డల సృష్టికిం దొలుత; నీవె వచించితి వాదికాలమం
దున నని దీని నమ్మకముతోఁ దెలియం గల నెట్లు? కేశవా! 3

అనుచు విస్మయముఁ దడిగిన నల్లన నగి
నగధరుం డనుఁ- బాండవా! నాకు నీకు
నెన్ని యో జన్మములు గతియించి చన్న;
వే నెఱుంగుదు, నెఱుఁగ వవెల్ల నీవు. 4

పార్థ! పుట్టుచావులు లేని ప్రభుఁడ నయ్యు,
నఖిలభూతేశ్వరుఁడ నయ్యు, నాత్మమాయ
చేత స్వప్రకృతిని నధిచేతన కొని
పుట్టు వెనసినాతఁడుగఁ గన్పట్టుచుందు. 5

ఎప్పు డెప్పుడు ధర్మవు ముప్పునఁ బడుఁ,
జొప్పడునధర్మ ముద్ధతిఁ జూరుముట్టు,
నప్పు డప్పుడు నాకు నే నాత్మమాయ
చేతఁ దగురీతి నన్ను సృజించుకొందు. 6

సాధుజనములఁ బ్రోవ, నసాధుజనులఁ
బట్టి పులికాఁపు వెట్టఁ, జూపట్టుపేర్మి
ధర్మమార్గమ్ము నెలకొల్ప ధరణి లెస్స
యుగయుగమ్మున రూపొందుచుందు నేను. 7

నలిని నప్రాకృతములైన నాదుజన్మ
కర్మములతత్త్వమును నిట్టిపేర్మి లెస్స

తొలఁగికొన్నయాతఁడు నేను దొఱఁగి వెండి
పొడమఁబోఁడు. సర్వాత్మనా పొందు నన్నె. 8

రాగభయకోపములకు దూరంగతులును,
మన్మయులు, మదుపాశ్రితుల్, మహితమతులు,
పడసి సంశుద్ధి జ్ఞానతపమ్ముచేతఁ,
గొనిరి మద్భావమే మోక్షమును బలువురు. 9

ఎవ్వ రేరీతి న న్నుపాసించువారొ,
వారి నారీతినే బ్రోచువాఁడ నేను;
నెల్లపుడు నెల్లమనుజులు నెల్లగతుల
ననుసరింత్రు నాశాసనము నె కిరీటి ! 10

కర్మఫలంబులం బడయుకాంక్ష గలా రిహలోకమందు నా
పేర్మిఁ బురందరాదు లగువేల్పుల నెల్ల యజించుచుందు వా;
రర్మిలిఁ గర్మలం బొసఁగునట్టిఫలమ్ములసిద్ధి నిక్క మే
మర్మము లేక సిద్ధ మగు మానుషలోకమునందుఁ గ్రక్కునన్.

అమర గుణకర్మములవిభాగముల క్రమము,
నాల్గు వర్ణములు సృజించినాఁడ నేను;
నిచ్చ తత్కర్త నైన న న్నీవు నిర్వి
కారుఁడు నకర్త యగు నాత్మగా నెఱుఁగుము. 12

కర్మమ్ములు నను ముట్టవు,
కర్మఫలస్పృహకు నాకుఁ గడు ద, వ్వని న
న్నర్మిలి నెఱుఁగఁగలాతఁడు
కర్మమ్ములఁ గట్టువడఁడు గాండీవధరా ! 13

ఇమ్మెయి తెన్నుగా నెఱిఁగియే యొనరించిరిసుమ్ము మున్ను క
ర్మమ్మును మోక్షకాములగుమాన్యులు పూర్వులు పూర్వవైఖరిన్;
సమ్మతి నీవుఁ గర్మమునె సల్పఁగఁదగ్గు, కిరీటి! పూర్వపూ
ర్వమ్మగు కర్మముం జలిపి రాజిలి రా జనకాదిపూర్వులున్. 14

కర్మ మనంగ నెద్దియో, అకర్మ మనంగ నెదో, యెఱుంగ కీ
కర్మగతిన్ మహాకవులుఁ గాంతురు మోహము; నట్లుకావునన్
గర్మము నీ కకర్మమును గ్రన్న వచింతు; నెఱింగి దీని, దు
ష్కర్మమునుండి వేఱుపడి శర్మముఁ గాంతువు భీతి డిందిపోన్.

విధివిహితకర్మములఁగూర్చి, విధినిషిద్ధ
కర్మములఁగూర్చి, నైష్కర్మ్యగతినిఁగూర్చి,
తెలిసికోవలసినయది గలదు చాల ;
తెలియ నలవిగానిది కర్మముల తెఱంగు. 16

ఓ పార్థా! పురుషుం డెవం డరయ నుద్యోగమ్మునం గేవల
వ్యాపారాత్మకమైన కర్మమునఁ గర్మాభావరూపంబు, న
వ్యాపారంబగు నయ్యకర్మమున వ్యాపారంబుఁ గర్మంబు; వాఁ
డేపో ప్రాజ్ఞుఁడు యోగి యెల్లక్రియలెంతేఁ జేసినాతండునున్. 17

పొల్పు వహించు నేపురుషపుంగవుకర్మము లెల్లఁ గామసం
కల్పవికారదూరములుగా, బుధు లాతనిఁగూర్చి చెప్పుచుం
డ్రల్పముగాని జ్ఞాన మను నగ్నినిఁ గర్మసమిత్తతిన్ దవు
ల్కొల్పితగిల్చి కాల్చినతఁడున్ ఘనపండితుఁ డంచు నెప్పుడున్.

సరవిన్ దవ్వులఁ ద్రోసి కర్మఫలలిప్సన్, నిత్యసంతృప్తినిన్
దొరయన్ నేరిచి, యర్థసాధనములందుం దృష్ణఁ బోకార్చుపుం

వరుఁ డొప్పారియు లోకసంగ్రహ మురూపమ్మైన కర్మమ్మునన్
నిరత, మ్మెయిసుమంత సేయనియతం డే యాతఁ డూహింపఁగాన్.

కోరిక లన్నియున్ విడిచి, గొబ్బున నెల్లపరిగ్రహంబులం
జేరిచి దూరమందు, కొని చిత్తము నాత్మము లోనుగా, మహా
శూర! శరీరసంస్థితికిఁ జొప్పడుకర్మముమాత్ర సేయుచుం,
బాపము నెన్నఁడొందఁ డఘుముం; గొను సంసృతినుండి మోక్షమున్

దైవవశంబునన్ దొఱకుదాన గడించుచుఁ దృప్తి, యీసుకుం
దా వొకయింత గాక, కడుఁదాలిమి మచ్చరమూడ్చి, ద్వంద్వసం
భావనఁ గ్రేవలం దదిమి, మానుగ సిద్ధి నసిద్ధి నొక్కఁడౌ
త్రోవనచూచు వాఁడు క్రియఁదోఁచియు బద్ధుఁడు గాఁడు దానిచేన్.

సంగమునం బ్రసంగము పొసంకగ, పొంగినజ్ఞాననిష్ఠయం
దుం గడు లగ్నమైన యెడతోఁ, బరమేశున కర్పణంబుగాఁ
జెంగున నాచరించుపనిఁ జేకొని వర్తిలు బ్రహ్మవేత్తకున్
సాంగముగా సమగ్రముగ నప్పుడ కర్మము లీనమై చనున్. 22

బ్రహ్మమె స్రుక్స్రువాదులును; బ్రహ్మమె సుమ్మహావిఃపదార్థముల్
బ్రహ్మమురూపమగ్ని నల బ్రహ్మము కర్త పొనర్చుహోమమున్
బ్రహ్మమె; యెల్లకర్మములు బ్రహ్మము లేయనియెంచు బ్రహ్మమా
బ్రహ్మముచేత నొందఁ గల భాగ్యము సైతము బ్రహ్మమే సుమా.

కొందఱు యోగనిష్ఠితులు కొల్చుచునుందురు సంతతంబు సం
క్రందనముఖ్యదైవములకట్టడ గల్గినకర్మయజ్ఞమున్;
గొందఱు బ్రహ్మరూపమగు గుర్తున భాసిలునగ్నియందు నా
నందముతోడ హోమమునొనర్తురు స్వాత్మముచేత నాత్మమున్.

మఱియుఁ గొందఱు కొన్న నెఱిఁ జెవి మున్నుగా
నెసఁగెడు నెల్లజ్ఞానేంద్రియములఁ
గర్మేంద్రియములను గడఁగి నిగ్రహ మన్న
యనలంబులో హోమ మాచరింతు;
రింకఁ గొందఱు యోగు లేడ్తెఱ శబ్దమ్ము
స్పర్శమ్ము మున్నైనవాని, వాని
కాధారభూతమ్ము లాకాశముఖముల
నింద్రియాగ్నులయందు నిడుచునుందు;

రెల్లయింద్రియకర్మమ్ము, లెల్లప్రాణ
కర్మములు నింకఁ గొందఱు కడకొని ప్రవి
లాప మెనయింత్రు జ్ఞానసందీపిత మగు
నాత్మసంయమయోగాగ్నియందుఁ బార్థ! 25

కొందఱు పుణ్యతీర్థములఁ గొంకని దానము లన్న యజ్ఞముల్,
కొందఱు కృచ్ఛ్రముఖ్యములు ఘోరతపమ్ముల పేరి యజ్ఞముల్,
కొందఱు యోగయజ్ఞములు, కొందఱు వేదము నేర్చు యజ్ఞముల్,
కొందఱు జ్ఞానయజ్ఞములు, కొందఱు గొంద్రు శితవ్రతమ్ములున్.

ప్రాణంబున్ జతగా నపానమునఁ గూర్పం జాలి పూరింతు; రా
ప్రాణంబందు నపానముం గలుపువారల్ రేచకప్రక్రియన్;
ప్రాణాపానగతుల్ నిరోధమున నాబంధించి కుంభింత్రుసూ
ప్రాణాయామపరాయణుల్ పలువురొప్పన్ యజ్ఞదీక్షాదృతుల్.

పరిమితాహారులై కొంద ఱరసి ప్రాణ
ములను ప్రాణములందుఁ గూర్పంగలార;

లర్జునా! వీర లెల్లరు యజ్ఞవిదులు,
యజ్ఞమునఁ బాప మడఁచికొన్నట్టివారు. 28

యజ్ఞశిష్టామృతాశను లైనఘనులు
పడయుదురు సనాతనమైన బ్రహ్మము; నెది
యేని యొకయజ్ఞమే లేనివానికి నిహ
లోకమే లేదన, మఱొక్క లోక మెటులు? 29

ఇమ్మెయి నెన్నో జన్నము లనేకవిధమ్ము లైన వల్ల బ్ర
హ్మమ్ముముఖమ్ముద్వారమునయందుననుండి ప్రపంచితమ్మునై
యిమ్ముల కెక్కియున్న; వవి యెల్ల నిజమ్ముగఁ గర్మజమ్ము; ల
చ్చమ్ముగ నిట్లెఱింగికొనఁజాలుదువో, కాన దీవు మోక్షమున్

కర్మజాత మంతయు సమగ్రముగ జ్ఞాన
మందుఁ బర్యవసానము నొందుఁ, గాన
ద్రవ్యమయమైన యజ్ఞముక్రమముకంటె
జ్ఞానయజ్ఞము మిగులఁ బ్రశస్యతరము. 31

శ్వేతవాహన! బ్రహ్మవేత్తలఁ దఱియఁగా
నరిగి, సద్భక్తి సాష్టాంగ మెఱఁగి,
శుశ్రూషఁ దప్పక, సుప్రసన్నుల వారి
నడిగి, నీ వెఱిఁగికో నగును జ్ఞాన
మును; దత్త్వవేత్తలు ఘనులు జ్ఞానులు దాని
నుపదేశ మొనరింతు రొసఁగి నీకు;
నెఱిఁగి జ్ఞానము లెస్స యిత్తెఱంగున మోహ
పంకిలమ్మున నెండి పడ వెన్నఁడు;

మఱియు, నద్దానికతన సమస్తభూత
ములను బ్రత్యక్షముగ నీవు దెలిసికొందు
వరసి ప్రత్యగాత్మయగు నీయందును, బర
మేశ్వరుఁడ నైన నాయందు; నింద్రసుతుఁడ! 32

పుడమిఁ గల యెల్ల పాపులమీఁకకంటె
నీ వతినికృష్టపాపివై నిలుతువేని,
గడఁగి వృజినమ్మనెడి కడలిఁ గడచి
చనఁ గలవు జ్ఞాన మను నావసాయమునన. 33

పాండవా! లెస్సగా మండింపఁబడినట్టి
నిప్పు కట్టెలనట్లు నిముసమంద
సందీపితమ్మైన జ్ఞానాగ్ని బసుమమ్ము
గావించుఁ గలయెల్లకర్మములను;
జ్ఞానమ్మునకుఁ జాల సరివచ్చుశోధక
సాధన మొకట్టిఁ డెచ్చటను లేదు;
కలిసి వచ్చిన దొడ్డకాలమ్మునకు యోగ
సిద్ధుఁ డాత్మమునందుఁ జెందు దానిఁ;

దత్పరుం డయి, యింద్రియదమము గలిగి,
శ్రద్ధ గలవాఁడు జ్ఞానసంసిద్ధిఁ బడయుఁ;
బడసి యచిరకాలమునందె వాఁడు పొందు
బ్రహ్మనిర్వాణరూపమౌ పరమశాంతి. 34

అజ్ఞుఁడును, శ్రద్ధకున్ దూరమైనవాఁడు,
సంశయాత్ముఁడుఁ, జెడును రసంశయముగ;

ననఘ! సందియమ్మునఁ బడునవద కిహము
గాని, పరముగాని, సుఖమ్ముగాని, లేదు. 35

శ్వేతవాహ! మఱొండు విను, పరమాత్మద
ర్శనరూపమై యొప్పుజ్ఞానయోగ
మున నెల్లకర్మమ్ములను సంన్యసించియు,
జ్ఞానసంఛిన్నసంశయుఁడు నగుచు,
నాత్మవంతుఁడు నైన యట్టివిద్వాంసుని
నెట్టికర్మమ్ములుం గట్టియిడవు;
కావున నజ్ఞానకలిలమ్మునం బుట్టి
హృదయసీమము మెట్టి కుదురుకొన్న

నీదుసందియమును బాపనిలయనమును
గఱకు వాఱుజ్ఞానాసిచే నఱికి యిడుము,
క్రన్న నిష్కామకర్మయోగమున కగుము,
లెమ్ము, పోర నూల్కొని యింక రమ్ము, పార్థ! 36

ఇది నాలుగవ నధ్యాయము.

# ఐదవ యధ్యాయము

## సంన్యాస యోగము

ఆ సిరిచెల్మికానినోఁడు లాసరణిన్ విని కర్త్రి, కర్మసం
న్యాసముఁగర్మయోగమును సర్మిలిఁ బేర్కొనుచుంటివెండియుం;
జేసిన నిందు నేయొకటి శ్రేయము పాయఁక దక్కునో, దయం
జేసి సునిశ్చితమ్ముగ వచింపుము దేవ! యటంచు వేఁడుడున్.

అనియె హరి యిట్లు: కర్మసంన్యాస కర్మ
యోగములు రెండునున్ మోక్ష మొసఁగునవియ;
కాని, జ్ఞానశూన్యంబైన కర్మసంన్య
సనముకంటెఁ గర్మసమాచరణమె లెస్స. 2

రాగమును ద్వేషమును లేక సాగుకర్మ
యోగి నిత్యసంన్యాసి నా నొప్పఁ గలఁడు;
ద్వంద్వములబారిఁ బడఁబోఁ డతండు, సుఖమ
కర్మబంధమునుండి మోక్షంబుఁ గాంచు. 3

సాంఖ్యమ్ము నాఁబడుసంన్యాసముం గర్మ
యోగమ్ము నీ రెండు నొండునొండు
వేర్వేఱు, సమకూర్చు వేర్వేఱుఫలముల,
నని మూఢు లందు; ర ట్లనరు బుధులు

పూనిక నవ్వానిలోన నేయొకఁ డాచ
రించియుఁ బడయును రెంటిఫలము;
జ్ఞాననిష్ఠ గరిష్ఠులైన సంన్యాసులు
పడువున నొందెడుపరమపదమె

యీశ్వరార్పణబుద్ధితో నెల్లకర్మ
ములను జలుపుయోగులుఁగూడఁ బొంద నేర్తు;
రొనరి సాంఖ్యమ్ము యోగమ్ము నొక్కటె యని
తెలిసికొనువాఁడె సర్వముఁ దెలియువాఁడు. 4

పారమార్థికసంన్యాస మారయంగఁ
బార్థ! కర్మయోగము లేక పడయఁబడదు;
కర్మయోగనిష్ఠుఁడు ముని కాంచు నచిర
మంద తాఁ బరమార్థసంన్యాసగతిని. 5

కర్మయోగయుక్తుం డయి, నిర్మల మగు
సత్త్వభావమ్ముతోడ నెసఁగి, వశి యయి,
యఖిలసర్వభూతాత్మభూతాత్మ కర్మ
ములను జలుపుచున్నను, వానఁ బూయఁబడఁడు. 6

అయి సమాహితచిత్తుఁ డాత్మతత్త్వముఁ దెలి
యంగ నేర్చిన పరమార్థదర్శి
కనుచున్న, వినుచున్నఁ, జనుచున్న, ననుచున్నఁ,
దినుచున్న, వాసనఁ గొనుచునున్నఁ,
దోసించుచున్న, నుచ్ఛ్వాసించుచున్న, ని
శ్వాసించుచున్న, రాపడుచునున్నఁ,

గనులు మూయుచునున్న, మొనసి విప్పుచునున్నఁ,
జేకొనుచున్నఁ, ద్యజించుచున్న,
నిదురఁ గొనుచున్న, నేరీతి నెఱపుచున్న,
నింద్రియార్థములం దెల్లయింద్రియములు
మెలఁగుచున్నవిగాని, నామెల పొకింత
యేని లే దని తెలిసి యూహించుచుండు. 7

ఎవ్వఁడు సర్వకర్మముల నేర్పడ బ్రహ్మమునందుఁ గూర్చి,. తా
నెవ్విధిఁ దత్ఫలమ్ములెడ నించుక సక్తుఁడు గాక, నేసుముల్
నివ్వటిలంగఁ జేయునొ, విసిర్మలుఁ డాతఁడు కల్మషమ్ముచేఁ
ద్రవ్వి స్పృశింపఁగాఁబడడు, తామరపాకు జలమ్ముచేనటుల్. 8

ఫలములపైనిఁ గోర్కె లోకపట్టునఁ బుట్టఁగ నీక, యోగివ
ర్యులు, మమకారభావనలు సూపతి పోయిన మేనితో, విని
ర్మలముమనమ్ముతో, నెఱులుమానినబుద్ధిని, నింద్రియాళితో,
సలుపుదు రాత్మశుద్ధికయి శాస్త్రము సెప్పినధర్మకర్మముల్. 9

కర్మఫలలిప్సఁ బోనాడు కర్మయోగి
నిష్ఠ నొప్పారుపరమశాంతిని గడించుఁ;
గాక సుసమాహితుఁడు, కామకారమునన
ఫలమునఁ దవుల్పడునతండు బంధ మొందు. 10

నిర్జితేంద్రియుఁ డగుదేహి నిఖిలకర్మ
సమితిని వివేకబుద్ధితో సంన్యసించి,
తాను చేయక, చేయించుతగవు గొనక,
పోరి సుఖముగ నవద్వారపురిని నుండు. 11

కర్తృత్వముం గాని, కర్మమ్ము లుం గాని,
కర్మఫలమ్ములకలిమిఁ గాని,
కలిగింపఁ డెపుడు లోకమున కల్ల ప్రభుండు;
ప్రకృతియే యమ్మెయిఁ బరగుచుండు;
నొకనిపాపముఁ గాని, యొకనిపుణ్యముఁ గాని,
బెరసి కొనంబోఁడు విభుఁడు; నెగడు
నజ్ఞానమున జ్ఞాన మావృతం బవు; దానఁ
గుడుచు మోహాము జంతుకోటియెల్ల;

నెవరి యాత్మీయ మజ్ఞాన మెడచివేయఁ
బడునొ జ్ఞానమ్ముచే, నట్టివారికిఁ బర
మార్థతత్త్వరూపము జ్ఞాన మమరిక వెలుఁ
గొందఁజేయు జ్ఞేయమును సూర్యుండువోలె. 12

ఆ పరబ్రహ్మవిజ్ఞానమందు బుద్ధి
నిలుపుకొని, తదాత్ము లయి, తన్నిష్ఠ నమరు
తత్పరాయణుల్, జ్ఞానాగ్నిదగ్ధకల్మ
షు లయి యపునరావృత్తినిఁ జూరఁగొంద్రు. 3

విద్యయు వినయముం గల్గి పెరిమ మెఱయు
బ్రాహ్మణునియందు, ధేనుపుపట్ల, నేన్గు
నెడలఁ గుక్కయందు, శ్వపాకు నెడల, భేద
మెడసి సమదర్శనులు పండితులు కిరీటి! 14

పాసి భేదభావము, సమభావమైన
బ్రహ్మమందు మనమ్ము స్థిరముగ నిలుపఁ

గలుగుసమదర్శు లిహమందె గెలిచిరైతు
రర్జునా! సర్గచక్రమున్ దుర్జయమును. 15

మొనసి సజాతీయముల్ విజాతీయముల్
స్వగతముల్, భేదముల్, పనుపడంగ
రానీక, సాత్త్విక రాజస తామస
గుణవికారమ్ములగుటినిఁ బడక,
సమ మయి, యేకమై, యమరుబ్రహ్మము సమ
మనఁబడు; నద్దాని కంటఁబోవు
దోసంబు లెవ్వియుఁ; దోఁకొని యటు సమ
దర్శులు నా బ్రహ్మదర్శు లనుచు
నీ వెఱుంగుమయ్య; నిర్దోషులై సమ
దర్శులైన పండితప్రవరులు
బ్రహ్మదర్శు లౌట బ్రహ్మమందే స్థితిఁ
గన్నయట్టివారుగద, గుణాఢ్య ! 16

పొదలి స్థిరబుద్ధి, మోహపుఁబొరలు లేక,
బ్రహ్మభావమ్ము నొందినబ్రహ్మవేత్త,
పొరసి ప్రియమును మునుఁగఁబోఁ డరుసమందుఁ,
బొంది యప్రియమును వగఁ జెందఁబోఁడు. 17

బాహ్యవిషయమ్ములం దవుల్పడనిఘనుఁడు
స్వస్వరూపమ్మునం దొందుపరమసుఖము
బ్రహ్మయోగయుక్తాత్ముఁడౌ బ్రహ్మమూర్తి
యక్షయంబుగఁ గలకాల మనుభవించు. 18

విషయేంద్రియసంబంధము
మిష నగుభోగంబు లెల్ల మృషలు, తుది మొదల్
విషమతఁ గలయవి; బుధుఁ డా
విషయపుమృగతృష్ణలందుఁ బెరయఁడు ప్రీతిన్. 19

కురుకుమార! కామమ్మునఁ గ్రోధమునఁ బొ
సంగు వేగమ్ముఁ దనువుఁ దొఱంగు దనుక
లోఁగొనం గల ఘనుఁ డిహలోకమందె
బ్రహ్మభావ మొందినవాఁడు, వాఁడె సుఖియు. 20

కౌరవా! విను, మంతస్సుఖమ్ము కలిమిఁ
దనరు చంతరారాముఁ డంతఃప్రకాశుఁ
డై వెలుంగుచయ్యోగి యిహమ్మునందె
బ్రహ్మభూతుఁడై బ్రహ్మనిర్వాణ మొందు. 21

ఎల్లపాపగతుల కెల్లసందియముల
కెడసి, యింద్రియముల నెల్ల గెలిచి,
యెల్లభూతతతుల హితమునఁ దగుబుధుల్
బ్రహ్మనిర్వృతిఁ గొని పరగువారు. 22

తొలఁగ నడఁచి కామక్రోధములను, మనము
నిలుపుకొని చేత, నాత్మముఁ దెలియుయతుల
కనఘ! దేహ ముండునుగాక, చనునుగాక,
బ్రహ్మనిర్వృతి తనకుఁ దాఁ బ్రాప్త మగును. 23

అర్జునా! వెలుపలి వయి చెవి మున్నైన
యింద్రియమ్ములచే గ్రహింపఁబడెడు

శబ్దమ్ముదొట్టి విషయముల నమ్మొయి
వెలి నిడి బుద్ధిచేఁ దలఁపఁబోక,
నడుమఁ గన్బొమల శాజ్ఞాచక్రమం దతి
నిశ్చలమ్ముగఁ జూపు నెలవుకొలిపి,
మానక ముకుగోళ్ళ మలయుప్రాణాపాన
ములు సమమ్ములుగాఁగ సలుప నేర్చి,
నిలిచి యిచ్ఛాభయక్రోధములకు నవలఁ,
బొడ వడంచి యింద్రియమనోబుద్ధిగతుల,
మోక్షమే లక్ష్యముగ సాగి, మొనసి మనన
శీలుఁ డౌ వాఁడు ముక్తుఁ డెవ్వేలనేని. 24

యజ్ఞతపములభోక్తనై, యఖిలలోక
ములకు నీశుఁడనై, భూతములకు నెల్ల
హితుఁడ నౌ నన్ను లెస్సగా నెఱిఁగి, పరమ
శాంతిఁ బడయఁ గలాఁ డట్టిజ్ఞాని; పార్థ! 25

ఇది ఐదవ యధ్యాయము.

# ఆఱవ నధ్యాయము

## ధ్యాన యోగము

కర్మఫలమును గోరక కార్యమైన
కర్మమును జేయునాతఁడు గణుతి కెక్క
నవని సంన్యాసి యన, యోగి యనఁ; గనఁగ ని
రగ్నియును నిష్క్రియుఁడె యట్టియతఁడు కాఁడు. 1

ఎలసి ఫలానుషంగ మొకయించుక యంచుక లేక, శాస్త్రముల్
పలికినయెల్లకర్మములఁ బాయక యాచరణంబునందు నె
క్కొలుపుట లెస్స యోగ మని కోవిదులందురు; పాండుపుత్ర! ని
శ్చలమగు బుద్ధి నయ్యదియె సంన్యసనం బని నీ వెఱుంగుమా. 2

కవ్వడీ! యసంన్యస్తసంకల్పుఁడైన
వాఁ డెవాఁడును యోగి కాలేఁడు; యోగ
మనఁగఁ జిత్తసమాధాన; మరయ నిట్టి
కర్మయోగి తా సంన్యాసికల్పుఁ డనఘ! 3

ధ్యానయోగమ్ముఁ బడయఁగాఁ దలఁచుమునికి
సలుపునిష్కామకర్మము సాధనమ్ము;
ధ్యానయోగమ్ముఁ బడసిన యల్లమునికి
సర్వకర్మసంన్యాసము సాధనమ్ము. 4

సర్వకామసంకల్పముల్ సంన్యసించు
నారురుక్షు వేనాఁ డింద్రియార్థములెడ
నెల్లకర్మమ్ములెడ సక్తి నెనయఁ బోవ
కమరు, నాఁడు యోగారూఢుఁ డనఁగఁబడును. 5

తనకుఁ దా నుద్ధరించుకోఁ జనును దన్ను;
దనకుఁ దా నధోగతిఁ గూర్చుకొనఁగఁ జనదు;
తన కయినయాప్తబంధుఁడు తానె సుమ్ము;
తనకు శత్రుఁడు మిత్రుఁడుఁ దానె పార్థ! 6

ఎవ్వఁ డాత్మను దా నిగ్రహింపఁ గలఁడో,
ఆతనికి బంధు వాత్మయే; ఆత్మను గెల
నట్టివాని కాత్మయె పగ యయి పెనంగు:
నాత్మ యనఁగ దేహేంద్రియాద్యములప్రోవు. 7

కౌంతేయ! విను, కార్యకరణసంఘాతమ్ము
గెలిచి, ప్రశాంతుఁడై చెలఁగువాని
శుద్ధాత్మ, శీతోష్ణసుఖదుఃఖములయందు,
మానమ్మునం దపమానమునందు,
నట్టివికారమ్ముఁ దొట్టక సుసమాహి
తమ్మయి వెలుగొందుతగవు నొందు;
శాస్త్రజన్యమ్మైన జ్ఞానమ్ముచేతను
ననుభవజ్ఞానమ్మనువుచేతఁ

దనివుఁ గొనినయాత్మమ్మునఁ దనరి, యింద్రి
యముల నరికట్టి, యవికంప్యుఁడైనఘనుఁడు



యోగి నాఁబడు; నా మహాయోగి సూచు
బంగరును మన్నుఁ డా నొకభంగిఁగాఁగ. 8

చెలుల, హితులఁ, బగఱ, నుదాసీనజనుల,
బందుగుల, ద్వేష్యులను, మధ్యవర్తులను, న
సాధువుల, సాధువుల, నెల్ల, సమముఁజూడ్కి
నరయువాఁడు యోగారూఢులందుఁ బ్రోడ. 9

ధ్యానయోగమ్మునఁ దనరువాఁ డుడుగక
యేకాంతమునఁ బీట నిడఁగవలయు;
నేకాకియై, తృష్ణ కెడగలిగి, పరిగ్ర
హము లెల్ల నవ్వలి కనుపవలయుఁ;
గాని లోనుగాఁ జిత్తమును మేను, నంతఃక
రణము లక్ష్యమునఁ దార్పఁగవలయుఁ;
బరిశుద్ధ మవుచోట స్థిరతరమ్మవు పీటఁ
దన కనువుగ వేసికొనఁగవలయు;

నందు దర్భలుఁ దోలుఁ జిత్రాసనంబు
నుత్తరోత్తరముగ వేసియుంచవలయు;
నంత యెత్తైనదియుఁ గాక; అంత పల్ల
మైనదియుఁ గాక, ఆ పీఠ మమరవలయు. 10

అం దుపవిష్టుఁడై, చలన మాఁగిచనన్, విషయోపసంహృత
మ్మం దనడెందమున్ నిలిపి పొందుగ లక్ష్యమునందుఁ, జిత్తవృ
త్తిం దగునింద్రియమ్ములగతిన్ ధృతి లోఁగొని, ధ్యానయోగమం
దుం దిర మొందఁగావలయుఁ దోఁకొని యోగి నిజాత్మశుద్ధికై.

మెలపున నెమ్మేను మెడ తల నూటిగాఁ
గుదురున నిలఁ జాఁచి కదలనీక,
స్థిరుఁ డయి, తనచూపు తిన్నగాఁ దననుకు
కొనపైన నిలుచుచొప్పున నిగిడ్చి,
దిక్కులు నూడక, తెలివిఁ బ్రశాంతమా
నంతఃకరణమును సంతరించి,
భయమును బోనాడి, బ్రహ్మచారివ్రత
స్థితుఁ డయి, నియమించి చిత్తవృత్తి,

నెసఁగి సుసమాహితుం డయి, యీశ్వరుండ
నయిన నాయందుఁ జిత్తము నమరఁజేసి,
నేనె పరమాత్మనను భావ మూని, నేనె
పరముగా నమాసీనుఁడై పరగవలయు. 12

ఇట్లు నియతమానసుఁ డయి యెపుడు నాత్మ
మును సమాధానమున నిల్ప మొనయుయోగి
వరుఁడు, మదధీన మవుచు నిర్వాణపరమ
మైన పరమశాంతినిఁ బొందు; ననఘ! వింటె? 13

తిండిపోఁతునకును, జాల తిండి మాని
తఱుఁగువానికి, నిద్దురదయ్యమునకుఁ,
గునుకక రెయింబవళ్ళు మేల్కనియ యుండు
వానికిని, యోగమే యలవడదు పార్థ! 14

తగవునఁ దగునాహారము,
తగినవిహారమ్ము తీరు, తగినవి చేష్టల్,

తపోద్ధుర, రేఁపు మెలఁగున,
తగువానికి ముక్తి పదము దగి యోగ మొసఁగు. 15

వినియతము చిత్త, మెప్పుడు, విడిచి బాహ్య
చింతలను, స్వస్వరూపమునఁ జేరి, నిలుచు
నప్పు, డఖిలకామస్పృహ నడఁచివైచి
వెలుఁగుసుసమాహితుం డని చెప్ప నొప్పు. 16

గాలి లేనితావున నుంత కదలఁబోక
నిలుచుదీపపుపోలుపె సూ, నిర్మల మగు
నాత్మయోగమ్ము సాగించునట్టి నియత
చిత్తుఁ డైనయోగికి సరియెత్తుపోల్కి. 17

పొరి యోగసంసేవ నరికట్టఁబడి చిత్త
మెం దుపశమము గడింప నేర్పు;
నాత్మ నెఱింగి శుద్ధాంతఃకరణముచే
నెం దాత్మునయందె తృప్తి నొందు;
నెం దతీంద్రియమై యొయిది బుద్ధి కెఱుక యగు
నాత్యంతికసుఖమ్ము ననుభవించు;
నేపార నై స్వస్వరూపభావమ్ముతో
నెందుఁ బ్రచ్యుతిఁ జెందఁ డీమనీషి;

పడసి యెద్దాని నంత కెక్కుడుగ మఱొక
లాభమును లాభముగఁ దలంపఁబోఁడో;
అమరి యేయాత్మతత్త్వమునందు నిలిచి
యెంత వంతనైను గదలింపఁబడఁడో; 18



అదియె దుఃఖసంయోగమహావియోగ
మైన యోగమ్ము నాఁబడు; నట్టియోగ
మును ననిర్విణ్ణచిత్తుఁడు బుధుఁడు నిశ్చ
యముగ నాచరింపన వలె నర్జునుండ! 19

సంకల్పమునఁ బుట్టుసకలకామములకు
స్వస్తిమంత్రము సెప్పివైవవలయుఁ;
గడు వివేకమ్ముతో నడుమనమ్మున
నింద్రియమ్ములు నిగ్రహింపవలయుఁ;
బొసఁగినధృతి నొప్పుబుద్ధితో మెలమెల
విషయోపరమమును బెరయవలయు;
స్వస్వరూపమునందు వడి నిల్పి మనమును,
దలఁపున వే ఱొండు గొలుపఁ జనదు;

చంచల మయి స్థిరత నొలయనిమన మెందు
నెందునుండి నిస్సరించు వెలికి
నందునందునుండి యరికట్టి యద్దాని
నాత్మవశముఁ జేయనగును బార్థ! 20

కలుషములు వాసి, మోహాదికములు కెడసి,
పరమశాంతమనస్కుఁడై, బ్రహ్మభూతుఁ
డైన యియ్యోగిపుంగవునందుఁ జేరు
నుత్తమోత్తమసుఖము కురూత్తముండ! 21

ఒలసి గతకల్మషుఁడు ధ్యానయోగి యిట్టు
లాత్మమును స్వస్వరూపమునందె యెపుడుఁ

చేర్చి నిలుపుచు, సుఖముగఁ జెందువాఁడు
బ్రహ్మసంబంధ మయి యొప్పు పరమసుఖము. 22

సర్వభూతములందు సమదర్శనుం డయి
యలరుచు యోగయుక్తాత్ముఁడైన
పండితప్రవరుండు, నిండారి సర్వభూ
తములందు స్థితి నొప్పుదనేఁగఁ దన్నుఁ,
దనయందు స్థితి నొంది తనరారుచున్నట్టు
లఖిలభూతములను నరయుచుండు;
వాసుదేవుండనై భాసిల్లు న న్నెవ్వఁ
డెల్లభూతములందు, నెల్లభూత
ములను నాయందుఁ గనుఁగొని తెలిసికొనునొ,
వాఁడు నాకుఁ బరోక్షభావంబుఁ గొనఁడు,
వాని నేనుఁ బరోక్షభావంబుఁ గొనను;
వానికిని నాకు భేదమే పలుకరాదు. 23

తెలివిఁ గలిగి ప్రత్యగ్బ్రహ్మముల కభేద,
మెవ్వఁ డెల్లభూతములందు నెనఁగు నన్నుఁ
గొలుచు, నట్టి సమ్యగ్దర్శి, మెలఁగుచున్న
నన్ని తెఱఁగుల, నిలుచు నాయందె మునిఁగి. 24

తనతోపాటుగ దుఃఖమో సుఖమొ, కాదా, యన్నెవో సర్వభూ
తనికాయమ్ములయందు నొక్కఁడుగ నిత్యం బెవ్వఁ డీక్షించు, న
య్యనఘుం డా సమదర్శనుండు విమలుండ యోగిమూర్ధన్యుఁ డ
య్యనలేనాతఁడు న య్యహింసకుఁడొకండే నాకభిప్రేతుఁడౌ.

నావుడు నర్జునుం డనియె: నాకనుతా! సమభావభావనన్
నీ వచియించుయోగమున నిశ్చలమౌ స్థితిఁ జంచలుండ నేఁ
గావున నొంద నోప; నటుగాక, మన మ్మతిచంచలం, బ్ర మదిం
తే విమథించి వైచి యలయించును దేహము నింద్రియమ్ములన్.

దానిబలమ్ముఁ జెప్పఁబని దమ్ములు సాలినవాని నెయ్యెడం
గానము, తంతునాగముఁ గమ్మున ఛేద్యము గాదు, నిక్కం, మ
ద్దానిని నిగ్రహించు టవిదారణ! గాలినటుల్ సుదుష్కరం
బౌ నని నామనం; బవిన నంబుజనాభుఁడు పల్కె నిమ్మెయిన్.

కౌంతేయా! నీ పలికిన
దంతయు నిక్కము; మనమ్ము నట్టిద; వశమౌ
నెంతయు నభ్యాసమ్మున,
సంతతవైరాగ్యబలవశమ్మున, నదియున్. 28

విను, మమ్మెయి నగ్రహీతా
త్మున కీ యోగమ్ము తెఱఁగు దుష్ప్రాపము; ఫ
ల్గున! యతనించెడువశ్యా
త్మునకు నుపాయమునఁ బొందుపోకల వెలయున్. 29

ఇది నామత; మ్మన, నింద్రునినందనుఁ
డనియె: నుపేంద్ర! శ్రద్ధాన్వితుఁ డయి
జతనమ్ము సేయనియతఁడు యోగముసిద్ధిఁ
బడయక యోగమ్మువలననుండి
దేహవియోగమ్ము దివురునత్తఱి జాఱి
గతిఁ దప్పునమ్మతి నెట్టిగతినిఁ బొందు!

వనజలోచన! బ్రహ్మపథమునందు వివేక
హీనుఁడై యాశ్రయ మెనయలేక,
గాడుపడి కర్మ యోగ మార్గముల రెంటఁ
ద్రోవఁబడి రెంటికిం జెడ్డ రేవఁ డయిన
యనద, పీలిక పీలిక లైన మొయిలు
వోలెఁ జెడిపోక మానునే పుడమిలోన? 30

సందియముల్ దొలంగి విలసన్మహిమాఢ్యుఁడవైన నిన్వినా
సందియముల్ దొలంపఁ గల సామిని నెందునుఁ గాన మన్నచో
సందియమా? ముకుంద! ఘోరసంశయలఁ జిందిలిపోకయుండ నా
సందియముం దొలంపు; మన, సమ్మతి శ్రీభగవానుఁ డిట్లనున్.

పాండవా! అటు లుభయవిభ్రష్టుఁ డైన
వాని కిహమునఁదనఁగాని, పరమునందుఁ
గాని, నాశము లేదు, నిక్కము; శుభములఁ
గడఁగి సలిపినాతఁడు చెడుఁ గుడువఁడుగద. 32

పుణ్యముల్ పొనరించికొన్న వారలలోక
ముల నొంది, యం దేండ్లుఁబూండ్లు నిలిచి,
పరమపావను లయి సిరిసంపదలతోడఁ
దఁదూఁగువారల నెలవులందు
నుదయ మొందునుజుఁడు యోగమార్గమునుండి
గలితుఁ డౌవాఁ; డట్లు గాదయేని,
బుద్ధిసంపద గొదనోక యోగనిరూఢు
లైన వారలకులమందె పుట్టు;

భారతా! సదాచారసంభావ్యులైన
యట్టివారలయిండ్లలోఁ బుట్టి వన్న
నూఱుజన్మములకును మనుజుఁ డెవాఁడుఁ
బడయఁగా లేఁడు; పడయుఁబో వాఁడు వాఁడె. ౪౩

పొలుపొందుచు నచోటఁ దొలిబామునందలి
　　బుద్ధిసంయోగసమృద్ధి లెస్స
పడయ నేరిచి, దానివైభవమ్మున వెండి
　　సంసిద్ధికొఱకై యతనసేయు;
వరలుపూర్వాభ్యాసబలమున, యోగమ్మె
　　తెరువునఁ దనకుఁ దా. దివురకున్న
నడిపింపఁబడును గవ్వడి! తొల్త యోగమ్ముఁ
　　దెలిసికో వేడుక సలిపి యటులు

పరగుఁగాకఁ తుదకుఁ బ్రాఁబల్కుమూటలు
వల్లెవెట్టి సెప్పునెల్లకర్మ
ములఫలమ్ములెడల మోమోటమే లేక
దాఁటి చనును వాఁడు; దారితారి! ౪౪

నిండుపూనికి జతనించునియతమాన
సుండు యోగివర్యుండు సంశుద్ధకిల్బి
షుం డయి యనేకజన్మసిద్ధుండు నగుచుఁ
బాండవా! పొందు నావలఁ బరమపదము. ౪౫

తాపసులకంటె, మఱి జ్ఞానధనులకంటెఁ,
గార్మికులకంటె, నెల్లరకంటె, యోగి

యు త్తమో త్తముఁ డని బుధాగ్ర్యులమతమ్ము;
కాన, నీవును యోగివి క మ్ము పార్థ! 36

ఇనభవాదుల ధ్యానించు నెల్ల యోగు
లందు, నాయందె తవిలినయాత్మతోడ
శ్రద్ధమెయి నన్నె సేవించుసిద్ధయోగి
యొకఁడె శ్రేష్ఠుఁడు నిష్ఠుఁడు నోయి! నాకు. 37

ఇది ఆఱవ్వ నధ్యాయము.

# ఏడవ నధ్యాయము

## జ్ఞాన విజ్ఞాన యోగము

అర్జునా ! వినుము, నాయందె దవిలినమ
నమ్ముతో, దిక్కుగా నమ్మి నన్ను,
తొస్సువోకుండ మనస్సమాధానమ్ము
నెఱపుచు నిచ్చలు నేర్మి నీవు,
తెలియ నేర్తువా విభూతిబలశక్త్యైశ్వర్య
ములు దొట్టి గుణములఁ బూర్ణుఁడ నగు
నను సందియమ్మున మునుఁగక యేదారి,
నాదారిఁ దిరపడునాదరమునఁ;

బూని విజ్ఞానసహితమా జ్ఞాన, మింకఁ,
దెలియఁ జెప్పెద నిదె నీకు; దీని లెస్స
దెలిసికొందువా, మఱివేఱ దెలిసికొన
లసినయది యేది మిగులునఁ బొసఁగఁబోదు. 1

నూటికిం గోటి కొకఁడు మనుష్యులందు
జ్ఞానసిద్ధికి జతనమ్ముఁ జలుపఁ బూను;
యతనమున మున్గుసిద్ధసహస్రమందు
నొకఁడుమాత్రమ నన్నెఱిఁగికో నోపు సరిగ, 2

కత్తి! మన్ను, నీళులు, నిప్పు, గాలి, మిన్ను,
మనసు, బుద్ధి, యహం కారముచు ననంగ
నెనిమిది తెఱంగు లయ్యె నర్జున! వినుము, మా
దీయమైన మాయాశక్తి యిది తలంప. 3

అనఘ! నా తెలిపినయట్టి మాయాశక్తి
యిది యపర యనంగఁ బొదలు; హేయ
మతినికృష్ట మిది సంసృతిబంధరూప; మి
ద్దానికంటెను బరమైన దొండు
మెఱయు; నన్నిటికన్న మిన్న యయ్యది యెల్ల
జీవరాసులకును జీవగఱ్ఱ;
యద్దానిచేత నీయఖిలజగమ్ము ధ
రింపఁగాఁబడుచున్న దింపు మీఱ;

నీపరావరప్రకృతులే యెల్లభూత
ములకును గతమ్ము లని నీవు తెలిసికొనుము;
పొడమ జగ మెల్ల, నెగడ, రూపడఁగిపోవ,
నేన పరమకారణ మౌట నిక్క మింత. 4

నాకంటె లేమ పరతర
మేకొంచెము నెచటఁ; బూస లెటు దారమునం,
దాకరణిఁ బార్థ! నాయం
దే కూర్పున వెలుఁగుచున్న దీజగ మెల్లన్. 5

విను నేనే నీళుల రస
మును, జంద్రాదిత్యులందు మునుకొను ప్రభ, ప్రా



మినుకులఁ బ్రణవము, నాకస
మున శబ్దము, పౌరుషమ్ము పూరుషులందున్. 6

ఇల మేలిగంధ, మగ్గిని
వెలుఁగు వెలుం, గెల్ల భూతవితతులలో ని
ర్మలజీవభావము, తప
స్వులయందుఁ దపస్సు, నేనె సుమ్ము కిరీటి! 7

మొనసి సర్వభూతములకు ననుఁ బురాణ
బీజముగ నెఱింగికొనుము విమలబుద్ధి!
బుద్ధిమంతులయందలి బుద్ధి నేను,
తేజు గలవారలందలి తేజ మేను. 8

కామరోగమ్ములకు గుఱి గాక బలసి
బలసమేతులలో నొప్పు బలము నేను,
తనరుధర్మువు తెరువును దప్పఁబోని
కామ మే నౌదు భూతనికాయములను. 9

జ్వాలయామయంహారణ! సాత్త్విక రాజస తామసమ్ములౌ
భావములెల్ల నావలన వావిరిఁ బుట్టిన వం చెఱుంగుమా
నీ; వల వానిపొంతఁ బడి నే నొకనాఁడు మెలంగఁబోవ; నా
భావము లెల్ల నెల్లపుడు వర్తిలుఁజూవె మదాశ్రయమ్ములై. 10

కలఁతన్ ముంప గుణత్రయాత్మములు రాగద్వేషమోహాదిక
మ్ములరీతుల్ పురుణించుభావములు సంమోహాన, నవ్వానిత్రో
వలకంటెం బర మూచు జన్మమరణవ్యాపారముల్ లేని నన్
దెలియం జాలక యున్నదీ జగము కౌంతేయా! రవంతేనియున్.

తలఁప గుణమయ మీ నాదు దైవమాయ
గెలువఁగా రాని దెవ్వారికినిఁ గిరీటి!
విడిచి యెల్లధర్మమ్ములు, విడక నన్నె
గొలుచువార లిద్దానిని గెలుచువారు. 12

మాయలమారిమాయ మటుమాయము సేయఁగ జ్ఞానసంపదం,
బోయి వివేకబుద్ధి, యఘముల్ పొనరించునరాధముల్, సతం
బాయతి నాశ్రయించుకొని యాసురభావముఁ, జెట్ట లౌచు, నా
రాయణునిన్ ననున్ శరణమంచు భజింపఁగ రారు భారతా!

పాండవ! ఆర్తిఁ జిక్కువడువాఁడును, దత్త్వ మెఱుంగఁ గోరునా
తండును, నర్థసిద్ధికి నెసం దమి సేయునతండు, జ్ఞానవం
తుండు, ననంగ, భూరిసుకృతుల్ నలుత్రోవలవారు సర్వపూ
ర్ణుండన యై వెలింగెడు ననున్ భజియింతురు నిచ్చ లెచ్చుగాన్.

ఆనల్వురందును జ్ఞాని నిరంతర
ధ్యాననిష్ఠుండును నద్వితీయ
మవు స్వస్వరూపమ్ముఁ దవిలి సేవించువాఁ
డును నయి యుత్తముఁ డనఁగఁబడును;
జ్ఞాని యావానికి నేను చాల ప్రియుండ
నౌముఁ, గావున నాకు నతఁడు నటులె;
వారక నాయందు భక్తిభావము సేయు
వార లెల్లరు మహోదారయశులె;

యైన, జ్ఞాని నాదునాత్మమే, నిక్కువ,
మనఁగ నతిశయోక్తి యనఁగఁ బోల;

దుత్తమగతి గాఁగ యుక్తాత్ముఁడై వాఁడు
నన్నె నమ్మి పడయ నున్నవాఁడు. 15

ఎన్నో జన్మపరంపరల్ గడచి, యెల్లే నొక్కటుల్ జ్ఞానసం
పన్నుండై వెలుగొందునిర్మలుఁడు సద్భావంబునన్ నన్నె పొం
ద న్నేర్చు; న్నిజ మీసమస్తమును బార్థా! వాసుదేవుండనా
నన్నుంగాఁ గనువాఁడు దుర్లభుఁ డనన్యప్రాభవోపేతుఁడున్. 16

ఆయాజన్మలకర్మవాసనలచే నాబద్ధులై, దొంగల
ట్లాయాకోర్కెలు జ్ఞానసంపదల నన్యాయంబుగాఁ గొంచుఁ బో,
నాయాయానియమంబు లెన్నుకొని తా రర్చింపఁగాఁ బూనువా
రాయా దేవతలన్ నరుల్ పలువు రాయాచాయలం బాండవా !

ఏయేభక్తుఁడు శ్రద్ధ నిచ్చపడు నేయేమూర్తి నర్చింప, నే
నాయాభక్తున కట్టిశ్రద్ధ నెటి నాయామూర్తిపైఁ గూర్తు; వాఁ
డాయామూర్తిని నిచ్చలుం గొలిచి యాయాశ్రద్ధతో భక్తితో,
నాయా వేళలఁ బొందు, నేనె యిడునాయాకోరికల్; కౌరవా!

అట్టికోరికలం గోరునల్పమతుల
ఫలము నశియించునదె యని తెలిసికొనుము;
దేవయాజులు గొందురు దేవతలను;
నాదుభక్తులు నన్నె పొందంగలారు. 19

తెలియఁబడక వాఙ్మానసములకు, నిర్వి
కారమై, నిరతిశయమ్మునై రహించు
నాపరంభావ మెఱుఁగక, రూపుఁ గన్న
వానిఁగా నెంతు రజ్ఞులు పార్థ ! నన్నుఁ. 20

కప్పఁబడి యోగమాయచే నొప్పనేను
గోచరుఁడఁ గాను జూ ప్రాణికోటి కెల్లఁ;
జావు పుట్టువు లేని నన్ సరవి నెఱుఁగ
నేర దీమూఢలోకము నిక్క మనఘ! 21

కడచినవి, కడచుచున్నవి,
కడవఁగ నున్నవియు, భూతగతు లెఱుఁగుదు నే
నుడుగక; కవ్వడి! యొకఁ డె
వ్వఁడు నన్ను నెఱుంగఁ డెపుడుఁ బరమార్థమునన్. 22

అలముకొన్న కామక్రోధములఁ బొసంగు
ద్వంద్వమోహమ్ముకతన భూతమ్ము లెల్లఁ
బొడముతఱి నొందుచున్నవి గడవఁబోని
మూఢభావమ్ముఁ బుష్కలముగఁ గిరీటి! 23

పున్నెములు సేసి లెస్సగా నన్నె మడఁచి
వైచికొన్న మహాత్ములు ద్వంద్వమోహ
పాశనిర్ముక్తులై దృఢవ్రతము లూని
నన్ను సేవించి భావింతు రన్నతౌజ! 24

పోరి జరామరణవిముక్తిఁ బొరయ నాశ్ర
యించి నన్ను లెస్సగ జతనించుఘనులు
మొనసి, బ్రహ్మము, నధ్యాత్మము, నల కర్మ
మును, దెలిసికోఁ గలరు సమగ్రముఁగ విజయ! 25

సాధిభూతాధిదైవుని సాధియజ్ఞు
నన్నుఁ దెలిసికోఁ జాలిన నంద్యయశులె



యెఱుఁగఁగలవారుసూ మేను దొఱఁగునపుడుఁ
గూడ నను యుక్తచిత్తులై కురుకుమార! 26

ఇది ఏడవ నధ్యాయము,

# ఎనిమిదవ నధ్యాయము

## బ్రహ్మాక్షర నిర్దేశ యోగము

అన నబ్బురంపడి యనిమిషాధిపనంద
నుం డిట్టు లనె; ముకుందుండ! నీవు
పలికిన యల పరబ్రహ్మమ్ము తెఱఁ గేది?
అధ్యాత్మ మనఁగ నెయ్యది దనర్చుఁ?
గర్మము నాఁబడి క్రాలఁగల్గెడి దేది?
బుధులు దేనిని నధిభూత మందు?
రధిదైవ మనుపేరఁ గధితమౌ నెయ్యది?
అధియజ్ఞ మీదేహమందు నేది?
దేహపాతావసరమున దేవదేవ!
తనరి సుసమాహితాంతఃకరణులచేత
నెట్లు తెలియఁగఁగోఁబడువాఁడ వీవు తెన్న?
తెలియఁ బలుకుము పలుకునఁ జిలుకు కూర్మి. 1

అనుడు ఖగధ్వజుం డనియెఁ గపిధ్వజా!
నీ వడిగినవాని త్రోవ లివ్వి;
పరమమై పరువారు బ్రహ్మమ్ము క్షరభావ
రహితమౌ సత్పదార్థమ్ము సూవె;

ఎల్లదేహములందు నెసఁగు బ్రహ్మప్రత్య
గాత్మభావంబె యధ్యాత్మ మనఁగ;
భూతభావమ్ములపుట్టువుల్ పొదలించు
నల విసర్గమ్ము కర్మ మనఁగఁ బరగు;

గిట్టి చనుకట్టఁబాటునఁ బుట్టునెల్ల
వస్తువు నధిభూతంబు నాఁబడును; బ్రాణి
కోటి కింద్రియశక్తిఁ జేకూర్చి, యినుని
లో వెలుంగుపురుషుఁ డధిదైవత మ్మ. 2

దేహధారులలో నెల్ల దివ్యమూర్తి
వర్జునా! విను, మీ దేహమందు, నఖిల
యజ్ఞములయందు, నభిమానినయి విష్ణు
రూపుఁడను నేనె అధియజ్ఞమై పరగుదు. 3

మరణకాలమునందు నేమఱక నన్నె
తలఁపునన్ నిల్పి కొలుచుచుఁ దనువుఁ దొఱఁగి
యరుగునాతఁడు నారూపుఁ బొరయు నేర్పు;
నిందు సందియ మేమాత్రమేని లేదు. 4

ఏ యే భావముఁ దాఁ దల
పోయుచు దేహమ్ము విడిచిపుచ్చునొ జీవుం,
డాయా భావము నొందును
ఆయా భావమున భావితాత్ముం డగుచున్. 5

కావున నేవేళల నను
నీ వోడక సంస్మరింపు, మింక డిగు మనికిన్;



శ్రోవ కిశీ మనోబుద్ధులు
ప్రోవుగ నాయందె, నన్నె పొందెను పార్థా! 6

కడఁగి యభ్యాసయోగయుక్తమయి, వేఱె
తెరువులం బోని చిత్తముం దొరసి, దివ్యుఁ
బరమపూరుషు ధ్యానించువరమనీషి
వానినే పొంది వెలుఁగొందుఁ బరమలీల. 7

మరణించువేళ సమాధివశమ్మునఁ
గలుగుచిత్తస్థైర్యబలముకలిమి
భ్రూమధ్యమునఁ బ్రాణమును నిల్పి నిలుకడఁ
బడినమనస్సుతో భక్తితోడ,
సర్వమ్ము నెఱిఁగెడుసామి, చిరంతనుఁ,
డెల్లజగమ్ముల కేలుగడయు,
సూక్ష్మమ్ముకంటెను సూక్ష్మతముం, డవి
చింత్యరూపమ్మునఁ జెలఁగువాఁడు,

తమముకంటె నవలఁ దనరువాఁ, డాదిత్య
వర్ణుఁ, డఖిలకర్మఫలవిధాత,
యైన యీశు నెన్న ధ్యానించుపురుషుఁ డా
పరమపురుషు దివ్యుఁ బడయ నోపు. 8

దేనిని వేదవేత్తలు వదింతురొ అక్షర మైన బ్రహ్మగా,
దేనిని వీతరాగులు యతిప్రవరుల్ నెఱిఁ జొచ్చి మందురో,
దేనిని చాల గోరుకొని తెల్విఁ జరింతురొ బ్రహ్మచర్యమున్,
నే నిదె నీకుఁ దత్పదము నెమ్మి వచించెద సంగ్రహమ్ముగాన్. 9

ఇంద్రియమ్ముల నెల్ల నేపున నియమింపఁ
జాలి, యనాహతచక్రమందుఁ
గదలకుండ మనస్సు నదికించి, యల సహ
స్రారచక్రముమధ్యమందుఁ దనదు
ప్రాణానిలమ్మును బాదుకొల్పి, దృఢమ్ము
యోగసంధారణోద్యోగ మూని,
ధ్యానించుచున్ నన్ను, నక్షరబ్రహ్మాభి
వాచకం బగు ప్రణవమును నోట
నుచ్చరించు చెవఁడు చెచ్చెర దేహమ్ము
విడిచిపుచ్చి వెడలుఁ కడఁకఁ దొడుగు,
వాఁడు పరమమైన పద మొంది వెలుఁగొందు;
నిందు లేదు పార్థ! సందియమ్ము. 10

ఏకాగ్రచిత్తుఁడై యెవఁ
డేకాలము విడక నను స్మరించునొ, ఆ సు
శ్లోకునకు నిత్యయుక్తున
కా కృతి కా యోగి కేను నతిసులభుఁడఁ జూ. 11

పరమమోక్షమ్ముఁ బడసినపరమయతులు
మొనసి మద్భావవై భవమును గడించి,
మరల నెల్లదుఃఖములకు నిర వశాశ్వ
తమ్ము నైన పుట్టువును నొందరు నరుండ! 12

బ్రహ్మలోకమ్ముతో గూడఁ బరగు నెల్ల
లోకములుఁ బునరావర్తు లే కదయ్య,

నన్నుఁ బడయుభాగ్యంబు సంపన్న మైన
యెడఁ బునర్జన్మ మనుమాట తడవఁబడదు. 13

లలి నొక వేయి మహాయుగ
ములు గల కాలంబు బ్రహ్మమున కొక పగ, ల
ట్టులె రాత్రియు నగు నని వినఁ
బలికి రహోరాత్రవిదులు పండితు లనఘా! 14

ఆ పవలింటిపూట నుదయంబును గాంచును నా ప్రజాపతి
స్వాపమునుండి వ్యక్తపడి స్థావరజంగమముల్ సమస్తముల్;
ప్రాపున నా ప్రజాపతికి రాతిరి రా, నవి యెల్ల వానియా
స్వాపమునందె పొందువడి వర్తిలు లీనములై; కురూద్వహా! 15

ప్రాక్తనకల్పభూతనికరమ్ములె యిమ్మెయి నుండియుండి సు
వ్యక్తత, నాప్రజాపతికి నొతఁటి రేయి, వశమ్ము దప్పి యు
వ్యక్తమునందు లీనముల యై, మరలం బవ లేగుదేరఁగాఁ
బ్రాక్తనలీల జాలువడి వ్యక్తములై మనుచుండుఁ బాండవా!16

సర్వస్ఫూర్తి సమస్తభూతములు నాశం బందినన్, నాశసం
భావ్యప్రక్రియయందు నేది పడ, దా భావంబు సర్వోత్తమం,
బవ్యక్తంబునకన్న మిన్న కదు, నవ్యక్తంబు, ప్రత్నంబు; నీ
వవ్యక్తుండవు గా కెఱింగికొను మీయర్థంబులం బార్థుఁడా ! 17

వహి నవ్యక్త మసంగ నక్షరపరబ్రహ్మమ్మును, మ్మల్లదే
మహితంబై యనపాయమై పరమగమ్యం బైన మత్థాన మా;
మహితుల్ దేనిఁ బొంది కెంకియును సంసారంబునం జేర, ర
మ్మహిమాఢ్యంబు పదంబె నాపరమధామం బర్జునా ! వింటివే ?

ఎవ్వనియందుఁ బొందుపడి యేర్పడుచున్నవో భూతరాసు లి,
వ్వెవ్వనిచేత వ్యాప్తమయి యీజగ మెల్ల వెలుంగుచున్నదో,
యెవ్వఁడు శాశ్వతుండు పరుఁ డీశ్వరుఁ డా పురుషుం డనన్యమై
త్రెవ్వనిభక్తిభావమునఁ దీరిచి లభ్యతరుఁడు; పాండవా! 19

ఏ కాలాత్మకమైన మార్గమున యోగీంద్రుల్ రయం బేగి, యీ
లోకంబందున వెండి రామియు, నటుల్ కొన్నాళ్ళకున్ రాకయుం
గైకో నేరిచి పేరుముల్ గొనెద, రా కాలస్వరూపంబు నే
సాకల్యంబుగఁ దెల్పువాఁడ వినుమా సంక్రందనానందనా! 20

అగ్నియు, జ్యోతి, స్సహః శుక్లపక్షమ్ము,
లాఱు నెలల యుత్తరాయణమ్ము,
నా నొప్పు కాలాభిమానిని దేవతల్
వెలయుమార్గమ్మున వెడలునట్టి
బ్రహ్మవేత్తలు పొంది బ్రహ్మలోకము పర
బ్రహ్మభావమ్మును బడయువారు;
క్రీడి! ధూమము, రాత్రి, కృష్ణపక్షము, నా ఱ్నె
లల దక్షిణాయన మలరుత్రోవ
నునుఱుఁ దొఱఁగునావలఁ జనుయోగిజనులు
చాంద్రమసమైన జ్యోతిస్సు సాంద్రవృత్తిఁ
బడసి, కర్మఫలమ్ములు గుడిచి లెస్స,
తిరిగి యిహలోకమునకు నేతేరువారు. 21

శుక్లకృష్ణమ్ము లనెడు నీ చొప్పు లీరు
జ్ఞానకర్మాధికృతులకు శాశ్వతమ్ము;

లఁగి యొకటిదారిని యోగి తిరిగి రాఁడు,
రెండవు తెరువునం బోయి వెండి వచ్చు. 22

భారత! యీ యిరుత్రోవల
సారమ్ము నెఱింగి యోగిజనుఁ డెవ్వండున్
జేరఁడు మోహాపువల; నీ
వోరిమి నెవ్వేళ యోగయుక్తుఁడు వగుమా. 23

జానుగ దేనినిం దెలియఁ జాలినయోగివరుండు, వేదవి
ద్యానిధులందు, నధ్వరవిధానములందుఁ, దపస్సులందునున్,
దానములందు, లెస్స కథిత మ్మవు పుణ్యఫలమ్ము దాఁటి నా
స్థానము నాద్యముం బరము శాశ్వతముం గొను; శ్వేతవాహనా!

ఇది ఎనిమిదవు నధ్యాయము.

# తొమ్మిదవ నధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్య యోగము

పూని వివరించెద నవి
జ్ఞానంబై రాస్యమైన జ్ఞానము, నీర్ష్యా
ధీనుఁడవు గామి నీ కిఁక;
దీనిఁ దెలిసి భవమునుండి తెరలెదు పార్థా ! 1

ఇది రాజవిద్య, యిది శుభ,
మిది పర, మిది రాజగుహ్య, మిది ధర్మ్యతమం,
బిది ప్రత్యక్షావగమం,
బిది యవ్యయ, మాచరింప నిది సుసుఖమ్మున్. 2

శ్రద్ధాభక్తులు లేకీ
సద్ధర్మముఁ దెగడుజనులు సంసృతిపాశా
బద్ధుల యై మిత్తికి నెఱ
సిద్ధముగా నగుదురయ్య, చెందక నన్నున్. 3

కౌంతేయా ! తత మీజగ
మంతయు నవ్యక్తమూర్తి నవునాచే న
శ్రాంత; మఖిలభూతములు మ
దంతఃస్థము, లేను వానియం దుండఁజుమీ 4

నలి నెఱుంగఁగరాని నాదునైశ్వరయోగ
సంఘటనమ్మునశక్తి నరసి
పరికింపఁగదవయ్య పార్థ! భూతము లెల్ల
నిజముగ నాయందు నిలిచి లేవు;
భూతభావన మయి పొలుపొందునాయాత్మ
మొకనాఁడు నాభూతనికరములకు
నాధారముంగాని యాధేయముంగాని
కానేర దింత నిక్కముగఁ గొనుము;

ఎల్లెడల నిండి యెల్లపు డేఁచి యాక
సమున నెట్లు మహానిల మమరియుండు,
నట్లె భూతములెల్ల నాయందు నిలిచి
యున్న వని నీ వెఱింగికొమ్మోయి! లెస్స. 5

కుంతికి ముద్దుకాన్ప! వినుకొండొక రాస్యపుఁబల్కు, కల్పకా
లాంతమునందు భూతనివహంబు లివెల్లఁ జొరంగఁబాఱి వి
శ్రాంతి మదీయమైన యపరాప్రకృతిన్ మనియుండు, నెండి క
ల్పింతును గల్పవేళ మొదలెత్తుడు నే విసృజించి వానినిన్. 6

తివిరి మదీయమైన ప్రకృతిం గొని లోనుగ, మాటిమాటికిం
దవిలి సృజించుచుందుదుఁ బృథాసుతమధ్యమ! వింటె, నేననే
కవిధములైన భూతములగ్రామము లన్నియు; నవ్వి యెల్ల బి
ట్టవశములై మహాప్రకృతియాటకు లోఁబడియున్న వెన్నఁగాన్.

ఓ సవ్యసాచి! కర్మము
లా సర్గాద్యములు కట్టి యంటవు నన్నున్;

వాసి నుదాసీనుండటు
లాసీనుండ నయి తవుల నాకర్మములన్. 8

సతత మేవికారము లేక సర్వసాక్షి
నైన నాచే నధిష్ఠిత మయి గుణమయి
యైన ప్రకృతి జగమ్ముఁ దా నీనుచుండుఁ;
గాన, మనుఁగుచున్నది విమోహాన జగము. 9

అఖిలభూతమహేశ్వరమై యెసంగు
నాపరంభావము నెఱుంగ నోప కజ్ఞ
జనులు తిరమరకఁబడుదురు, మనుజతనువుఁ
గొన్నవానినిఁగా నెంచి నన్ను నలఁతి. 10

అనుపద మూని రాక్షసము నాసురముం గరణాత్మభావమున్
మనుకొని మోహకమ్మనక, మూఢజనుల్ పడు మందురాలసిం,
గొని, విఫలమ్ములై చెడిన కోరికలన్, నెటి చన్న కర్మభా
జనత, వితావితాపడిన జ్ఞానము, వ్యర్థవివేకవిత్తమున్. 11

శమదమాదిలక్షణ మయి యమరుదేవ
తాస్వభావముం గొని మహోదారపురుషు,
లెఱిఁగి భూతాది నవ్యయు నీశు నన్నుఁ
గొలుతు రేకాగ్రచిత్తతఁ, దలఁప కొండు! 12

కౌంతేయా! దృఢభక్తిని
రంతకులై నిత్యయుక్తులై సద్వ్రతులై
సంతతము న్నన్ను నుపా
సింతురు పాడుచుఁ బొగడుచు నెఱుఁగుచును యతుల్,

కొందఱు జ్ఞానయజ్ఞమునఁ గూడి యజించుచు నాయుపాసనం
గొందురు పెద్దదీక్షఁ; బఱికొందఱు శక్రుఁడు దొట్టి దేవతా
బృందముతో నభిన్నునిగఁ జేర్చి నెఱింగియుఁ; విశ్వతోముఖుం
గొందఱు వ్యష్టిభావమునఁ గొల్చుచునుందురు నన్ను; నర్జునా!

నేనే శ్రౌతస్మార్తవి
ధానక్రియ, లేనెనూ స్వధా, ఔషధమున్
నేనే, మంత్రము నేనే,
నేనే ఘృత, మగ్ని నేనె, నేనె హుతమ్మున్. 15

నేనే తల్లియుఁ దండ్రియు,
నేనే తాతను జగత్తు, కేనే ధాతన్,
నేనే వేద్యము, ప్రణవము
నేనే, సామమ్ము ఋక్కు నేనె యజుస్సున్. 16

నేనే గతియును బతియును,
నేనే ప్రాణులకు సాక్షి, నేనె పరమ్మున్,
నేనె నివాసము, శరణము
నేనే, శ్రేయమ్ము నేనె, నేనె సుహృత్తున్. 17

నేనే ప్రభవము జగముల,
కేనే లయకారణమ్ము, నేనే స్థానం,
బేనె యనూననిధానము,
నేనే యవ్యయము బీజ మేనె నిఖిలమునన్. 18

నేనె తపింపం జేయుచు
వానలు వెలయించుచుంటి వడి వెలుపులతోన్,

నేనే యమృతము, మృత్యువు
నేనే, సత్తును నసత్తు నేనే పార్థా! 19

ఋక్కు యజుస్సు సామము సమృద్ధి నెఱింగినవారు సోమముం
ద్రిక్కక ద్రాఁగి పాపములు ద్రెళ్ళఁగఁబెట్టుకొనంగ నేర్చి స
మ్యక్కగ యజ్ఞదీక్ష వెలయన్ ననుఁ గొల్చి సువర్గకాములై,
యక్కడ వారు దివ్యగతి నాగతిఁ గొందురు దేవభోగముల్.

చాల విశాలమై యలరుస్వర్గము నేండ్లనుబూండ్ల వార లు
ద్వేలసుఖాప్తిమై ననుభవించి, తఱుంగుడుఁ బున్నె మెల్ల నా
సోలుపునన్ నృలోకమును జొత్తురు; వైదికకర్మనిష్ఠలం
దేలెడుకామకాము లిదె తెర్వఁగఁ గొందురు రాకపోకలన్. 21

పాసి పృథక్త్వముఁ గొని మదు
పాసన, నిత్యాభియుక్తి వరలుమహాసం
న్యాసులయోగక్షేమ
వ్యాసంగము నే వహింతు ననుపద మెయిదిన్. 22

అధికభక్తితో శ్రద్ధతో -నన్య దేవ
తలను గొలుచువారలు సయితమ్ము నన్నె
తా మెఱుంగక యే కొల్చుతగవుఁ గొనిన
వా రటంచు నెఱుంగుము, పార్థ! నీవు. 23

ఎల్లక్రతువులకును, నెల్లయజ్ఞములకు,
నేనె భోక్తను, మఱి నేనె ప్రభుఁడ;
నిట్లు నన్ను లెస్స యెఱుఁగనేరనివారు
నడలువారు తత్త్వసరణినుండి. 24

దేవతలను నెలమి దేవవ్రతులు, పితృ
దేవతలను నల పితృవ్రతులును,
భూతజాతములను భూతేజ్యులును, మదు
పాస్తిపరులు నన్నుఁ బడయువారు. 25

ఆకో, అలమో, ఒకపూ
వో, కాయో, పండో, ఉదకమో, ప్రయతాత్ముం
డై కడు భక్తి నొసంగిన
ఆ కళ్యాణాత్మువిందు నాదృతిఁ గొందున్. 26

ఎది సేతువో, ఎది తిందువో,
ఎది వ్రేల్తువో, ఎది ప్రదాన మిత్తువో, యతివై
ఎది తపము నాచరింతువో,
అది యెల్లఁ బొనర్పుమా మదర్పణ మనఘా! 27

ఇమ్మెయిని శుభాశుభ ఫలదమ్ములైన
కర్మబంధనములనుండి కాంతు ముక్తి;
నవల సంన్యాసయోగయుక్తాత్ముఁడ వయి,
ముక్తుఁడవు నయి, లెస్స నన్ బొందఁ గలవు. 28

సర్వభూతములందును సముఁడ నేను,
నాకు ద్వేష్యుఁడుఁ బ్రియుఁడు నెవ్వఁడుఁ లేఁడు;
పరగి యుందుము భక్తి నన్ భజనసేయు
వారు నాయందు, నేను నవ్వారియందు. 29

అతిదురాచారుఁ డయ్యు ననన్యభక్తిఁ
దవిలి నన్ను భజించునతండు సాధు

వుగఁ దలంపునఁ జేయఁగాఁ దగియ యుండు;
వ్యవసితుఁడుగద లెస్సగా నతఁడు విజయ! ౩౦

ఆ యనన్యభక్తుండు ధర్మాత్ముఁ డగుచు
వేగ శాశ్వత మవు శాంతిఁ బెరయఁగలఁడు;
ముప్పాలమ్ములఁ జాటి చెప్పుము కిరీటి!
నాదుభక్తుఁ డొందఁ డెన్నఁడు నాశ మనుచు. ౩౧

స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, తివిరి పాప
యోనులం బుట్టువా రెవ్వరైనఁగాని,
అకరి సర్వాత్మనా నన్ను నాశ్రయింతు
రో, పరాంగతిం బొంది వెల్గొందఁగలరు. ౩౨

అట్టియెడఁ బుణ్యులై భక్తులైన బ్రాహ్మ
ణులను రాజర్షులను వేఱె పలుకవలెనె?
అస్థిరము సుఖదూరంబు నైన నరుల
పాలముపా లయితివి, భజింపు మిఁక నన్ను. ౩౩

నను నీ నెమ్మది నిల్పుమా, నిరతమున్ నాభక్తినే చేయుమా,
ననువౌనాయజనంబెపూనుకొనుమా, నన్నే నెఱిన్ మ్రొక్కుమా;
అనయం బేనె పరాయణంబుగ సుయుక్తాత్ముండవై యిమ్మెయిం
దనరన్ నేర్తువొ, యాత్మ నైన ననుఁ బొందన్ నేర్తు వీ వర్జునా!

ఇది తొమ్మిదవ యధ్యాయము.

# పదవు నధ్యాయము

## విభూతి యోగము

నానోడులందుఁ బ్రీతిపడి నాయెడఁ బ్రేముడిఁ జూపునీకు నేఁ
బూని వచింతు నెండియు నపూర్వ మఖర్వ మనుత్తమోత్తమం
బైన రహస్య మిం కొకరుఁ, డర్జున! యింతకుఁ గారణమ్ము నీ
పై నిఁ గలట్టి కూర్మియు, భవద్ధిత కామనయున్, నిజంబుగాన్. 1

జా నెసలారు నాదుప్రభుశక్తివిశేషముఁగాని, పుట్టువుం
గాని, యెఱుంగ రెన్నఁ డల కంజభవాదిసురాధినాథులుం
గాని, మహర్షిపుంగవులుఁగాని, మఱెవ్వరుఁగాని; వింటివా
వీనుల? నమ్మహర్షులకు వేల్పులకున్ నిజ మాది నేనె నూ. 2

కాన ననాదిఁగా, నజునిఁగా, నను లోకమహేశ్వరేశ్వరుం
గా, నరుఁ డెవ్వఁ డెవ్వలన గాటపుమోహతమోహతిం గనుల్
గానఁగరాని చీఁకుదొర గాక యెఱుంగఁగ నేర్చు? నాతఁ డీ
మానవలోకమందు నసమానుఁడుఁ బాపసమూహముక్తుఁడున్

సిద్ధతేజుఁడ! వింటె? బుద్ధియు, జ్ఞానంబు,
మోహమలమ్మున మునుఁగఁబోమి,
తాలిమి, సత్యంబు, దమమును, శమమును,
మోదమ్ము, ఖేదమ్ము, పుట్టు, గిట్టు,

భయము, నిర్భయమును, ప్రాణిపీడనమున
మొనయమి, సమచిత్తమునఁ బ్రవృత్తి,
సంతుష్టి, తుష్టి పొసంగమి, తపమునఁ
దనుపీడనమ్మును, దాననిరతి,

కీర్తి, యపకీర్తి, మున్నుగాఁ గీర్తితములు
భావములు భూతముల కెల్ల నావలననె
కలుగుచుండును; దమతమ కర్మగతుల
ననుసరించి వేర్వేఱుగఁ బొనరు నవియు. 4

మును పల మహర్షు లేడ్వురు,
మనువులు నల్వురు నొదవిరి మద్భావులు నా
మనమున; నీపొలమునఁ గాం
చ నమరునర్వంబు వారి సంతానంబే. 5

ఎవఁ డీ విభూతియోగము
నవిరతగతి నెఱుఁగ నేర్చు, నవ్వెంపున వాఁ
డవికంపమైన యోగము
తవులున మివులంగలాఁడు తథ్యము పార్థా! 6

సకలప్రభవుఁడ నేనే,
సకలము నావలననే పొసఁగుచున్న దటం
చకలుషగతి నెఱిఁగి బుధ
ప్రకరము భజియించు నన్ను భావయుతంబై. 7

తమయంతఃకరణంబు నింద్రియములుం దాకొల్పి నాయందె, ని
త్యము నన్యోన్యముబోధసేసికొనుచున్, దత్త్వంబునన్ మత్కథా

క్రమముల్ వర్ణనసేసికొంచు. వినుచుం, గాంతేయ! హర్షప్రక
ర్షము నిండార రమించుచుందురు బుధుల్ శ్రద్ధాసమంచద్విధుల్.

అమ్మెయి నిత్యయుక్తతనులై విడవాడనివానికిఁ బ్రీతిపూ
ర్వమ్ముగ నన్ భజించునలవారల కేను పరమ్ము బుద్ధియో
గమ్ము నొసంగుదున్; స్థిరతఁ గ్రాలినబుద్ధిఁ బొసంగి యందు, ని
శ్చయమ్ముగ నన్ను నే పడయఁగాఁ గలవారలు వార లర్జునా! 9

వారి ననుగ్రహించువనిఁ బట్టియె పట్టున నే నవారి న
వ్వారలభావమందుఁ జొరఁబాఱి, వెలింగెడుజ్ఞానదీపదు
ర్వారతరార్చితోఁ దొలఁచివైతు సుదూరమునందు నజ్ఞతా
కారముకల్మిఁ గూపుఁ గొని క్రమ్మిన చీఁకటికప్పు; ఫల్గునా! 10

అనుడు ధనంజయుం డనియె: జనార్దనా!

నీవు పరంబ్రహ్మ, మీవు పరమ
ధామ, మీవు పవిత్రతరమూర్తి, వీవు మ
హాతిశ్రేష్ఠుఁడవు, నీ వనుత్తముఁడవు,
నీవు పూరుషుఁడవు, నీవు శాశ్వతుఁడవు,
నీవు విభుండవు, నీ వజుఁడవు,
నీవు దివ్యుఁడ, వీవు దేవదేవుండవు,
నీ వనాదివి, నీవు నిర్మలుఁడవు,

ననుచు నిచ్చలు దేవర్షి యైన నార
దుం డసితుఁడు దేవలుఁడు వ్యాసుండు మొదలు
గా మహర్షులు పలుకుదు; రీమెఱవున
నీవు స్వయముగఁ జెప్పుచున్నావు నాకు. 11

నీవు నా కను విదియెల్ల నిక్క మనియె
నమ్ముచున్నాను నెమ్మది నలిననాభ !
నీప్రభావమ్ము నెఱిఁగిరో నేరరు భగ
వానుఁడా ! సురాసురులు నెవ్వారలేని. 12

నిఖిల ! నీవు నీచేతనే నిన్ను గుర్తె
ఱింగికొనుచు నున్నాఁడ వుత్తుంగయశుఁడ !
భూతభావన! భూతేశ! భువనములకు
నెల్లఁ దల్లియుఁ దండ్రియు నెల్ల నీవె. 13

ఏ విభూతులతోడ నీయెల్లలోక
ములను వ్యాపించి నీవు వర్తిలుచునుంటి
నో, పరమదివ్యముల యయి యొప్పమీఱు
వాని నా కెఱిఁగింపుము వాసుదేవ! 14

నిను ధ్యానించుచు సచ్చలే నెఱిఁగికో నిన్ నేర్తు నేరీతిగా?
నిను నేభావములందుఁ గ్రందుకొని చింతింపన్ వలెన్? వెండియున్
వినిపింపంగదె నీవిభూతులు, దయాప్తిన్ నీమనైశ్వర్యమున్;
దనివుం జెందదు నీవచోమృతము నానంగ్గియున్ డెందమున్.

నావుడు వాసుదేవుఁ డను నా వవు దివ్యవిభూతు లన్నియున్
వావిరిఁ బల్క నూల్కొసిన వర్షశతమ్ములకైన నక్కటా
రా వొకకొల్కి కేనియుఁ, బరంతప! కావునఁ దత్ప్రధానతా
భావముఁ గొన్న వాని నొకవంతున నీ కెఱిఁగింతు వి న్మిటుల్.

ఓ గుడాకేశ! సర్వభూతోదరముల
యందు వెలుఁగొందు నల ప్రత్యగాత్మ నేనె;

ఎల్లభూతసంతతులకు నేనుపడెడు
నాదిమధ్యావసానము లరయ నేనె. 17

నే నాదిత్యులలోన విష్ణు వవుదున్, దేజంబులం దంశుసం
స్థానంబైన రవిన్, మరీచిని మరుత్సంఘంబునం, జుక్కలం
దే నిందుండను, సర్వవేదములయం దే సామవేదమ్ము, దే
వానీకమ్ముల నింద్రుఁ, డింద్రియములం దౌదున్ మనం బర్జునా!

భూతజాతములందు బుద్ధివృత్తిని నేను,
రుద్రులలో శంకరుండ నేను,
యక్షరాక్షసులందు నైలబిలుండను,
వసువులలోపలఁ బావకుఁడను,
పర్వతమ్ముల మేరుపర్వతమ్మును, పురో
హితులలోపల బృహస్పతిని నేను,
సేనానులన్ దేవసేనావిభుండను,
సరసులలో నెల్ల సాగరమును,

విదితులౌ మహర్షులయందు భృగుఁడ నేను,
పలుకులందు నేకాక్షర ప్రణవ మేను,
యజ్ఞములయందు జపయజ్ఞ మవుదు, స్థావ
రములలో హిమాలయ మౌదుఁ బ్రథితయశుఁడ! 19

త్రోవ కెల్లెడఁ జెట్లలో రావిచెట్టు
నవుదు నేను కిరీటి! దేవర్షులందు
నారదుండ, గంధర్వగణమ్ములందుఁ
జిత్రరథుఁడను, కపిలుఁడ సిద్ధులందు 20

అమృతమునకుఁ దోఁబుట్టువు
కొమరున నుచ్చైశ్శ్రవమ్ము గుఱ్ఱములం, దు
త్తమదంతులఁ జౌదంతిని,
ప్రముఖుల నరులన్ నరాధిపతి నే ననఘా! 21

ఆయుధములందు నవుదు వజ్రాయుధంబు,
ధేనువులయందు నల కామధేను వేను,
పుట్టువుం గూర్చు కందర్పుపొలితి నేను,
సర్పముల వాసుకిని నేను సవ్యసాచి! 22

నాగములందు ననంతుఁడ,
బాగుగ యాదస్సులందు వరుణుఁడఁ, బిత్రురా
డ్భాగంబుల నర్యముఁడను,
యోగేచ్ఛుఁడ! యముఁడ సంయమోద్యోగులలోన్ 23

పొలదిండ్లం బ్రహ్లాదుఁడ;
గలయించెడు వారలందుఁ గాలుండ, మృగం
బులలో సింగంబును, ప
క్షులలో వినతాసుతుండఁ, గురుకులదీపా! 24

పావయితలందు నేనే పవనుఁడ, శస్త్ర
ధారులం దెల్ల నే నౌదు దాశరథిని,
జలచరంబులలోన మొసలిని నేను,
నదులలోపల గంగను, నంద్యవిభవ! 25

అనఘు! సృష్టులందు నాదియు మధ్యము
నంత మేను, విద్యలందు నాత్మ

విద్య యవుదు నేను, విను, వాద జల్ప వి
తండములను వాదధార్ష్ట్య మేను. 26

అక్షరములయందు నకార మవుదు నే, స
మాసములయందు ద్వంద్వసమాస మేను,
నాశనము లేని కాలమునలువు నేను,
శ్వేతహాయ! విశ్వతోముఖధాత నేను. 27

నిఖిలమును మ్రింగుమృత్యువు నేను, పొడమ
నున్నవానికి బీజ మే నోయి పార్థ!
నారులకుఁ గూర్చు కీర్తి శ్రీ నెగడువాక్కు
స్మృతియు మేధయు క్షమయును ధృతియు నేను. 28

సామమ్ములన్ బృహత్సామ మే, ఛందస్సు
లందు గాయత్రి యన్ ఛంద మేను,
మాసమ్ములం దెల్ల మార్గశీర్షము నేను,
ఋతువులందు వసంతఋతువు నేను,
మోసంపుటాటల మొదటి జూదము నేను,
తేజస్వులం దెల్లఁ దేజ మేను,
జయశీలురందు నే జయము నౌదును, వ్యవ
సాయపరుల వ్యవసాయ మేను,

సత్త్వవంతులందు సత్త్వమ్ము నే, వృష్ణు
లందు వాసుదేవుఁ డవుదు నేను,
పాండవుల ధనంజయుండ నే, మునులలో
వ్యాసమునిని, కవుల భార్గవుండ. 29

దమనశీలురయం దేను దండ మవుదు,
నెమ్మిమై జిగీషువులందు నీతి నేను,
నేనె గోప్యవృత్తులయందు మౌన మవుదు,
జ్ఞానవంతులలో మేలి జ్ఞాన మేను. 30

వేయి నోడు లేల? ఫల్గునా! వినుము, సర్వ
భూతములకు విత్తన మేనె, శ్వేతవాహ!
నేను లేకుండఁ బొసఁగఁగా నేరుచునది
యీ చరాచరములయందు నెందు లేదు. 31

నాదివ్యతరవిభూతుల
కేడీ తుది యన్నమాట? ఈమాత్రముగా
లే దనక నీకుఁ దెలిపితిఁ
బ్రోఁదిపఱిచి యేకదేశమునఁ గొంతేయా! 32

ఎది యెది విభూతిగలదో,
ఎది యెది శ్రీమంతమో, మఱెది యూర్జితమో,
అది యది మత్తేజోంశము
కుదురునఁ బొదలిన దటంచు గుఱుతు నెఱుఁగుమా. 33

ఇంత నాప్రబోధమ్ముతో, నింత నీశ్ర
వణముతో నేల? ఒకమాట వినుము పార్థ!
ఈ సమస్త ప్రపంచమ్ము నేను నాదు
నొక్కకళతోడ వ్యాపించి యున్నవాఁడ.

ఇది పదవు నధ్యాయము.



# పదునొకండవ అధ్యాయము

## విశ్వరూప సందర్శన యోగము

అన విజయుం డనె: మదనుగ్రహమునకై ర
హస్య మనక నీ వనిన యధ్యాత్మసంజ్ఞ
కమ్ము శుభవాక్కు విను డది నన్ గప్పియున్న
కలుషమోహమ్ము పంచబంగాళమయ్యె. 1

భూతములపుట్టుచావులు పొసఁగు నీవ
లనన యని విస్తరముగ వింటిని ముకుంద!
అవ్యయంబైన నీదుమహామహత్త్వ
మెల్ల నీవల్ల నిటు లాలకించినాఁడ. 2

ఓ పురుషోత్తమ! సరి నీ
రూపమ్మునుగూర్చి నీనిరూపిత మెల్లన్;
నీపరమేశ్వరరూపముఁ
జూపుము, కోరిక పొసంగెఁ జూడఁగ నాకున్. 3

ఆ నీ యవ్యయరూపము
నే నీక్షింపం గలాఁడ నేనియు నెనరుం
బూని యిఁకం జూపుము దే
వా! నాథుడు నగుచుఁ బలికె భగవానుఁ డిటుల్ 5

నీ వేడ్కన్ గమనించినాఁడ విజయా! నీ కింక మే లౌను, నా
నావర్ణాకృతులం దిరమ్మగపడునై, నానాప్రకారమ్ములై,
భావింపంబడరావు, దివ్యములు భవ్యమ్ముల్, వ్యయానూహ్యముల్
నావిశ్వాకృతు లన్న; నన్న! కను సిండం జూడుమా చూపెదన్

వేలుం గోట్లును నాస్వరూపములు దుర్వేద్యమ్ము; లౌఁగాక, నీ
వోలిం జూడుము నా మెయిన్, విజయుఁడా! యొప్పారునాదిత్యులన్
వాలాయంబున రుద్రులన్, వసువులన్, నాసత్యులన్, గాలులన్,
జాలం బేలక యెందుఁ జూడని మహాశ్చర్యంబులం దాలిమిన్.

స్థావరజంగమమ్ములకుఁ దావల మైన జగమ్ము నంతయున్,
నీ వెది యింకఁ గోరెదవొ నెమ్మదిఁ జూడఁగ దాని నా మెయిన్
వావిరిఁ జూడు; మీకనుల నాదగునైశ్వరయోగముం గనం
గా వెఱఁ గొందు, నిక్కమటుగాన నొసంగెద దివ్యచక్షువున్. 7

ఓ జాత్యంధుఁడ! వింటె నానుడి? మహాయోగీశ్వరేశానుఁ డా
రాజీవాక్షుఁడు పల్కి యీసరణిఁ, బార్థా! చూడుమా యంచ చోఁ
దాఁ జూపెం, బరమాద్భుతంబయిక నన్, ద్యావాభువోభాగముల్
రాజత్తేజముకల్మిఁ దేజరిలిపో, రాణించు దివ్యాకృతుల్. 8

ఎన్నో మోములు, నెన్నియో తలలు, నెన్నోఁ జేతులుం గాళ్ళు, నిం
కెన్నో కన్నులు, నెన్నియో తొడలు, నెన్నో వ్రేళులుం గోళ్ళు, లిం
కెన్నో సొమ్ములు నుద్యతమ్ములయి యెన్నో నాయుధమ్ముల్, మఱె
న్నెన్నో రత్నకిరీటముల్ మెఱయు నెంతే నద్భుతం బా మెయిన్.

పలుచని దివ్యగంధముల పైపయిపూఁతలు, పింజెపోఁతలం
దొలఁగని పట్టుపుట్టముల తోరపుకట్టుబడుల్, మెఱుంగులం

బలిసిన యుత్తరీయముల పైపలెవాటులు, క్రొత్తకస్తురిం
గులుకుచుఁ దీర్చిదిద్ది యిడుకొన్న సుమాళపుఁజుక్కలున్, భళా!

చిలుపచిలుపని తేనెలఁ బిలిచి పీట
వేసి తుమ్మెదజతలకు విందు పెట్టు
క్రొత్తపూలమాలలతోడఁ గులుకుచుండె
నహాహా! విశ్వతోముఖ మయ్యనంతురూపు. 11

వేయి వెలుఁగులు గలయట్టి వేల్పుసామి
లొక్క వేవు రాకసమున నొక్కమాఱు
వెలసి వెలిగిన, నమ్మేని వెలుఁగుతోడఁ
జెప్పఁ గల మేము పోలికఁ, జెప్పలేను. 12

తుది మొదలన్న మాట యెటుఁ దోఁపక రూపఱ కందఁబోని సం
పద కవు విశ్వరూపమునఁ బార్థుఁడు కన్గొనె శౌరిమేనఁ జ
క్కఁ దనరి యొక్కపాదున, జగమ్ము సమస్తము వేయిరూపులం
గొదకొని సంవిభక్త మయి కొన్నసమున్నతి నున్న దానిఁగాన్.

అంతఁ గలంత నుంచి యిడు నగ్గలపా వెఱఁ బెద్దభీతి నా
క్రాంతమనస్కుఁడై, పడకుఁగమ్ముకొనన్, మెయిపుల్కరింప, వృ
త్రాంతకపుత్త్రికుండు రచితాంజలియై శిరసా ప్రణామముల్
వంతులు వేసి చేసి, భగవానునితో ననియెన్ వినీతుఁడై. 14

దేవా! భూతవిశేషసంఘములబుద్ధిం, బూజ్యు నీశాను, రా
జీవాంతఃశుభకర్ణికాసనసమాసీనున్ సురజ్యేష్ఠున్,
దేవస్తుత్యయశుల్ మహర్షివరులన్, దివ్యోరగశ్రేష్ఠులన్,
వే వీక్షించుచునుంటిఁ గన్నులెదుటన్ నీదివ్యదేహంబునన్. 15

పాదును బాహువట్టమును బైతలయుం గనరా, కనేకబా
హూదరవక్త్రనేత్రమయి యొప్పి, దెసల్ పదియావరించి, యే
పేది, యనంతరూపమయి, యీమెయిఁదోఁచె మహాద్భుతస్థితిన్
నీవపుదివ్యరూప; మనసీభరవారక! దుఃఖతారకా! 16

అదె నీరత్నకిరీటరాజము మెఱుం, గా కానఁ గావచ్చున
ల్లదియే నీగద, నీసుచక్రము సహస్రాదిత్యసంకాశమై
పదనుల్ వారి భ్రమించుచున్న దదిగో, పద్మాక్ష! నిన్ జూడఁ గం
టిదరిన్ విప్పల నీవు నీతనువునన్ దీప్తానలార్కప్రభల్. 17

ఇనకోటిప్రభ! వేదితవ్యము పరం బేకాక్షరబ్రహ్మ మీ
వు, నిధానంబవు విశ్వవిశ్వమునకున్ భూతేశ! నీవే, సనా
తనుఁడా! నాశము లేక శాశ్వతముగా ధర్మమ్ము రక్షింతు వీ
వు, నిరీహుండవు, పూరుషోత్తముఁడవుం బూర్ణుండ వీ వచ్యుతా!

పొలుపుగ సూర్యచంద్రము లిరువు ర్వెలుఁగొందుచున్న వారు క
న్నులుగ ననాదిమధ్యనిధనుండవు నీకు, ననంతవీర్యసం
వలితుఁడ! మంటునగ్గివలెఁ బ్రజ్వలమైన మొగంబుతోడ నీ
వెలుఁగున నీజగం బుడికి బిట్టు నెఱింపడుచున్న దవ్యయా! 19

మింటికి మంటికి నొక్కఁడుగ మేకొని నిల్చి యొకండ వీవె వె
న్నంటి వలంకు లీరయిదు నంకిలివెట్టి గ్రసించినాఁడ వే
యంటును సంటునున్ విడువ; కద్భుతమా భవదుగ్రరూపముం
గంటన చూచి భీతిలి జగత్త్రియ మాకుల మయ్యె నెంతయున్.

కొందల మొంది వేలుపులు గుంపులుగాఁ జొరుచున్న వారు నిన్;
గొందఱు భీతిఁ గే ల్మోగిచి కొండికలై నిను వేఁడుచున్నవా;

రందఱు సిద్ధులున్ ఋషులు నౌనని స్వస్తులు పల్కుచున్ నిష
ద్బృందముతోడ ని న్నభినుతించుచు నుండిరి విశ్వరూపుఁడా !

దేవా! సిద్ధులు, సాధ్యులున్, వసువు, లాదిత్యుల్, మరుద్రుద్రవి
శ్వేవర్గమ్ములవారు, వేల్పుపురిలో వెజ్జుల్, పితృల్, యక్షర
క్షోవీరుల్, గుమిగూడి కన్నులఁ గనుంగో మూఁగుచున్నా రిదే
నీవిశ్వాకృతి నద్భుతమ్మును, వెఱల్ నిండార, విశ్వేశ్వరా ! 22

వేలున్ వేలు మొగమ్ములుం, గనులునున్, వీపుల్తొడల్, దాడలుం
గాలుం జేతులు, కుత్తుకల్, తలలు, మీఁగాళ్ళున్, నాసళ్ళున్, జ్వాల
జ్వాలాభీలములై కరాళములు దంష్ట్రల్, నాల్కలున్, మీఱు ని
న్నాలోకించి వడంకుచున్నది జగం; బట్లైతి నేనున్ హరీ ! 23

మండెడునిప్పుగోళములమాదిరి మంటలు గ్రక్కు నీమహో
ద్దండవిశాలనేత్రములతారలతీ రటు లుండ నిమ్మహో !
నిండినకెంజిగిం గదలు నీపెదనాలుకఁ జూచినంత నా
గుండెలు బ్రద్దలై యవిసి గుండములై పడుచున్న వచ్యుతా! 24

తాలిమి దూలిపోయె, మది తావులు దప్పెను, గాళు లూఁచలై
కూలఁగ లాఁగుచున్నయవి, కుత్తుకలోఁ దడి యాఱిపోయె, గ
గ్గోలు మెయిన్ శమమ్ముఁ గడుఁ గోల్పడితిం, గనఁ జాల నే నిఁకం
గాలకృశానుకీలలకుఁ గమ్మరికొల్మిల నీముఖమ్ములన్. 25

నాథ! ప్రసాదబుద్ధి నిఁక నాపయిఁ జేయుము మ్రొక్కుకొందు నే;
నీధృతరాష్ట్రనందనులు, నెల్లనృపాలురు, వారివారలున్,
ద్యోధునికన్నకాను, పల ద్రోణుఁడు, కర్ణుఁడు దొట్టివారు, మా
యోధులుసైతముం జొరుచునుండిరి నీదుముఖంబులం దదే! 26

కొందఱు గోరపుంగొనలకోఱలసందునఁ జిక్కి వ్రేలుచుం
గ్రిందులుగాఁ దలల్ నలిగి గీయని యార్చుచు నున్న వా; రిఁకం
గొందఱు కొండతాళ్ళటులు కొంకనికాళులక్రింద నల్గి వే
బందనవాఱి మాఱిరిదె పచ్చడిపచ్చడిగా జనార్దనా! 27

వేలు నదీప్రవాహములు వేగము నాఁగని పెద్దవాఁకలం
దేలుచు సింధురాజునొడిఁ దిన్నఁగఁ బోయి యడంగునట్లుగా,
జాలున వీర లెల్లరు నెసం జొరఁబాఱుచునున్న వా, గురు
జ్వాలలు గ్రక్కు నీభయదవక్త్రబిలంబులయందు గుంపులై. 28

మండెడునగ్గిని మిడుతల
దండులటుల్ మాడిపోవఁ ద్వరపడి వీరల్
తండోపతండములుగా
నిండం బడుచున్నవారు నీనోళులలోన్. 29

మ్రింగుచు నెల్లజగమ్ముల
నంగిలి రుచిచూచుచుంటివా, విశ్వాత్మా!
పొంగిన నీమతనూరుచు
లంగడ నుడికించుచున్నవయ్యా! వాసిన్. 30

నీ వెవ్వండవో, ఈమహోగ్రతనువున్ దేనిన్ సుసాధింపఁ గై
కో వాంఛించితివో, ప్రసాదమతి నాకుం దెల్పవే, దేవదే
వా! వేద్యుండవుకాని నీదవుమహత్త్వం బే నెఱుంగన్, నమ
స్తేవాక్యంబులు పల్కువాఁడ; ననఁ, బ్రీతిన్ విశ్వరూపుండనున్.

కాలుండం, గలనాత్మకుండను, జగత్కల్యాణసంపాదన
శ్రీలోలుండ; నివేళ నట్టిపనికే చేకొంటి నీరూపు; సం

బాళింపంగలవాఁడ సర్వము; ద్విషత్పక్షంబువా రెల్లరున్
నేలం గూలక మాన రింకఁ; బనియే నీకోడ లే దర్జునా! 32

కావునఁ గాళ్ళు నాఁప కిటు క్రన్ననఁ బోరికి లెమ్ము, శ్రేయముం
గావుము, దాయలం దునిమి గారవ మొందుము రాజ్యలక్ష్మి సం
భావనఁ గూర్చుకౌఁగిట; నవారణ వీరల సవ్యసాచి! నే
నే వధియించితిన్ మును పె, నీవు నిమిత్తముమాత్ర మేసుమీ!

మనమం దించుక సందియంపడకుమా, మందాకినీనందనుం
డును ద్రోణుండును సైంధవుండు నలకర్ణుండున్ మఱిచ్ఛాహతుల్
మును పే, నీ విఁక నామమాత్రముగ రూపుల్ మాపుమా వారి, నూ
ల్కొనుమా పోరున, మానుమా భయము, గెల్పుంగాంతు వీవర్జునా!

అన విని నెన్నొసల్ పుడమి నంటఁగ సారెకు మ్రొక్కి యిట్టని
ల్వ్యానమెయిఁ గ్రమ్మ వాఱు వెఱఁ బుట్టఁగ డంకునఁ దూలిపోయి ఫ
ల్గునుఁ డనె వెండి రాపడు నెలుంగున; నచ్యుత! నీయశమ్ము క
ల్మిని జగ మొందుచున్న యది లెస్స ముద మ్మనురంజనమ్మునున్.

వెఱచి వలంకులం బఱుగు వెట్టఁ దొడంగిరి రక్కసుల్; కరం
బెఱఁగుచునున్న వారు సుర లెల్లరు సిద్ధులతోడఁ గూడి; వా
దఱి తొలివిత్తు బ్రహ్మకును, నన్నిటికన్నను మిన్నయైన నిన్
గుఱిచి నమస్కరించు టొక గొప్పయెకో భువనంబు లవ్యయా!

ఎల్ల జగంబులున్ నిలుచు నెంతయు హాయిగ నీదుకుక్షిలో;
నెల్లరు వేల్పుసాము లొనరింతురు నీపదసేవ తొత్తులై;
ఎల్లెడ నెల్గుచుండు వఖిలేశ్వరుఁడా! సదసత్పరత్వసం
పల్లసితంబు నక్షరము బ్రహ్మము నీవె నిజం బనంతుఁడా! 37

నీవే తొలిదైవంబవు,
నీవే యీవిశ్వమునకు నిరతనిధానం,
బీవే వేత్తయు, వేద్యము
నీవె, పురాణపురుషుండ వీవే, దేవా! 38

ఓ విశ్వాకృతి! నీచే
నావృత మీ విశ్వ మెల్ల; నంతము గలదే
నీ విమలరూపములకున్;
నీవు పరంధాము డవుదు నిఖిలాధారా! 39

అరయఁ బవనుఁడు శమనుఁడు
వరుణుండు పితామహుండు ప్రపితామహుఁ డీ
శ్వర! వైశ్వానరుఁ డల చం
దురుఁడు ప్రజాపతులుఁ నీవె; తోఁచదు వేఱే. 40

మ్రొక్కెద నీకుం దృప్తిగ
మ్రొక్కెద నొక వేయిమార్లు, మ్రొక్కెద మఱియున్
మ్రొక్కెద వెనుకన్ ముందుల
మ్రొక్కెద నే నెల్లయెడల మ్రొక్కెద దేవా! 41

సర్వమ్ము నావరించి య
ఖర్వము వీర్యమున గర్వకలన వెలయుటన్
సర్వేశ! సర్వభూతాం
తర్వర్తీ! కొంటి సర్వనామము నీవే. 42

అనుఁగున నెచ్చెలికాఁడవన్న మఱిఁ గృష్ణా! యాదవా! మాధవా!
యనుచుం దావకమైన యట్టిమహిమం బావంత గుర్తింప కేఁ

జనవుం జేసె ప్రమాదముం బొరసి పల్కెం బెల్మియుం బిల్చియుం
టిని, మన్నించి యనుగ్రహింపఁగదె సన్నిండారుకూర్మిన్ హరీ!

వెలసి విహారముల్ సలుపువేళల, హాయిగ విశ్రమించు వే
ళల, సహభోజనంపుకతలన్ బరియాచక మాడి బావ యన్
తలఁపున నెంత గారవము దప్పినదారి మెలంగినాఁడనో,
చలమతి నాదొసంగులను సైరణసేయుము దేవ! మ్రొక్కెదన్

ఓ మహనీయ! యిట్టిదన నూహకొనరానిది నీప్రభావ మో
సామి! చరాచరాత్మకము సర్వజగమ్మును గన్న పెద్దయా
సామివి నీవు; నీకు సరిసాములు లేరుగదయ్య యెందు; నిం
కేమొగి నిన్ను మించువార లేర్పడువార? లనంతవీర్యుఁడా! 45

తిన్నఁగ వంచి మేను కడుఁ దిన్ననిభక్తి నమస్కరింతు, నా
పన్నశరణ్య! ని; న్నఖిలవంద్యుఁడ వాద్యుఁడ వీశ్వరుండ వీ
వన్న! ప్రసన్నబుద్ధి దొసఁగా వలఁ గూలిచి యేలుమా, సుతుం
గన్నతఁడున్, సఖున్ సఖుఁడు, గాంతను గాంతుఁడు నట్లు, నన్నికన్.

మును పేనాఁడునుఁ జూడ కద్భుతతమమ్మున్ నీదు నీరూపుఁ గ
న్గొని నెక్కొన్నముదంబునం బడితి, గగ్గో లయ్యెఁబో నివ్వెఱన్
మన; మో దేవ! ప్రసాదమున్ మొనసిసమ్మానంబుతో దొంటిరూ
పును జూపింపఁగదే, త్వదేకభజనంబుం దప్ప నే నెన్నఁడున్. 47

కమనీయం బగు పాంచజన్యము, లసత్కౌమోదకీశార్ఙ్గచ
క్రములున్, నాలుగుచేతులందు మెఱయంగాఁ, గ్రమ్మ వాఱంగిరీ
టమణిస్తోమరుచిప్రరోహములు మింటన్, లోచనానందకం
దము నీరూపము వేయిచేతులవిభుండా! కూర్మిఁ దాల్పంగదే.

అనుడున్ శ్రీభగవానుఁ డిట్లనియెఁ బార్థా! నీయెడం గొన్న కరుణ్ని, దేజోమయమై యనంతమయి దుర్నిరీక్ష్యమై యాద్యమై ఘన మీరూపును నాత్మయోగమునఁ గ్రక్కంజూపితిన్ నీకు నొక్కనికిన్; నిక్క మదృష్టపూర్వ మిది నీకంటెన్ మఱెవ్వానిచేన్.

కౌంతేయా! భవదన్యుఁ డెవ్వఁడు నృలోకంబందు నన్ జూడఁ గానంతే నేరుఁ డిట్టిరూపమున, వేదాభ్యాసముం జేసినన్, సాంతత్యంబున జన్నముల్ సలిపినన్, దానంబు లీఁబూన, దుర్దాంతంబుల్ తపముల్ పొనర్చినను, గర్మస్థైర్యముం గాంచినన్.

కని నారూపము ఘోరరూపము నిటుల్ కౌంతేయ! నీ కింక నెమ్మనమందున్ వెఱ మూఢభావకలయుం బ్రాపింపఁ బోకుండుఁగాక; నిమేషమ్ములు లేని వేల్పుదొరకుం గారాబుబిడ్డండ! కన్గొనుమా పూర్వపు సౌమ్యరూపమున నన్నున్ సుప్రసన్నుంగడున్.

అని వాసుదేవుఁ డయ్యా
ర్జునునకు వెండియు స్వసౌమ్యరూపమ్ముం జూ
పి నితాంతభీతు నాతనిఁ
జనవున నాశ్వాసపఱిచె, సఖుఁడా! యనుచున్. 52

అంతం గొంతివరాలబిడ్డఁ డనె, దేవా! కాంచి కన్గొంయి నిక్లంతే శాంతరసమ్ముజా ల్గురియు నీ యీ మానవాకారమున్ సంతోసంబున భీతిఁ బాసి కుదుటం జక్కంబడెన్ నామనం; బంతుం బంతును లేదు నీమహిమమం, దజ్ఞాతపత్రేక్షణా! 53

వానికి వాసుదేవుఁ డిటు పల్కె ధనంజయ! నీకు గోచరంబైన మదీయదివ్యతను వన్నెత మేరికి నెందుఁ జూడఁగా

కానిది, దివ్యతేజము; నిరంతర ముప్విళ్లు లూరుచుందు రి
ద్దానినిఁ జూడ వేలుపులుఁ; దప్పదు నీపయి నీర్ష్య వారికిన్. 54

ఇప్పకక కొన్న వేదములచేతఁ, దపమ్ములచేత, నిత్యదా
నవిధులచేతఁ, భూతయజనమ్ములచేత, జపమ్ముచేత, నీ
వవిరళవృత్తిఁ గాంచిన మదద్భుతరూపముఁ జూడ నేర రే
ప్రవరులు; నందుకుం గల యుపాయము పాయనిభక్తియే సుమీ.

ప్రోఁదియొవర్చుకోఁ గలుగుపొందికఁ జొప్పడుభక్తితోడ వే
దాములయందుఁ బొంచుపడునట్టి పవిత్రయశుండుమాత్ర మే
వేది యెఱింగికోఁ గనుల నీవటు లీక్షణసేయ నేర్చువాఁ
డీదృశు విశ్వరూపు నను; నియ్యెడ వాదులు లేవు ఫల్గునా! 55

నాకోసమ్ముగఁ గర్మముల్ సలుపుచున్, నాదిక్కె నమ్ముచున్,
నాకుం బ్రీతిగ భక్తి సేసికొనుచున్, సంగంబుఁ బోనాడి, స
ర్వాకారంబుగ భూతజాతములచాయన్ వైరమే లేని సు
శ్లోకుం డచ్చుగ నన్ను నే పడయ నేర్చుం బాండవా! వింటివా!

ఇది పదునొకండవ యధ్యాయము.

# పండ్రెండవు నధ్యాయము

## భక్తి యోగము

అనవుడు, నిత్యయుక్తతమమై నిను విశ్వాతనున్ భజించు భక్తనికరమందు, వ్యక్తమవుదారిఁ దిరంపడ కక్షరమ్ముగాఁ దనరెడుబ్రహ్మముం గొలువఁదారొకొనుభక్తులయందు, నెన్న, నే యనఘులు యోగవిత్తములో, ఆనతి యిమ్మని క్రీడి వేడుడున్.

శ్రీభగవానుఁ డిట్లని వచింప దొరంకొనె: నిత్యయుక్తులై నాపయిఁ భక్తులం బొదలి, నాపరమాద్భుతరూపముం దెదన్ క్షోభిలనీక నిల్పి, కడుఁ జొప్పడుశ్రద్ధ ప్రసిద్ధి కెక్కఁగా, నాభజనంబునన్ మునిఁగి నానెడుభక్తులు యుక్తు లెంతయున్.

సవ్యసాచీ! విను, సర్వకాలములందు
సమబుద్ధిఁ బడసి, ద్వంద్వములఁ బడక,
ఎల్లభూతమ్ములహితమున నిరతులై,
యింద్రియమ్ములు నిగ్రహించి లెస్స;
పలికి నిర్దేశింప నలవి గా, కప్రమే
యమ్మయి, యూహల కందఁబోక,
కదలిక మొదలిక పొదల కేయదనునఁ,
గూటస్థమై, యెల్లచోటులందుఁ



జాల నిండియుండి, శాశ్వత, మక్షర
మైన బ్రహ్మము నసమానగతి ను
పాసనమున నిలిపి పరగుజ్ఞానులు నన్నె
పడయఁ గలరు నిజము పాండవుండ! 3

అవ్యక్తాసక్తాత్ముల
కావ్యాసంగమునఁ గ్లేశ మధికతరము, కౌ
రవ్యుఁడ! దేహులు సుగముగ
నవ్య క్తగతిం బడయునయము నొందరు సూ. 4

నరుఁడ! సమస్తకర్మములు నాయెడ సంన్యసనమ్ము సేసి, మ
త్పరు లయి, నాయెడన్ నిలుపువాఱినచిత్తముతో, ననన్యయో
గరసికులై, యెవేళ నను గట్టిగ ధ్యానము సేయుభక్తులం
గరకరి దుర్భవాంబునిధిగర్భమునుండి సముద్ధరింతు నేన్. 5

విశ్వరూపుఁడ నాయందు వెలసి మనసు
నిశ్చయాత్మికమవు బుద్ధి నెలవుకొలుపు;
మనఘ! దేహమ్ము దొఱఁగినయవల మిపుల
నీవు నాయందె నిలుతువు, నిక్క మింత. 6

అర్జునా! నాపల్కినటు లెప్ప డెందమ్ము
నరికట్టి నాయందుఁ దిరముపఱుప
నోపవే, నభ్యాసయోగయోగమ్మున
ననుఁ జేరుజతనమ్ము నడుపుమయ్య;
అభ్యాసయోగమ్మునందును నేరవో,
మత్కర్మపరమత మలయు నగుము;

తలపోసి నా(పీతి సలిపియుఁ గర్మములఁ,
కడు సత్త్వశుద్ధినిఁ బడయఁ గలవు;

కవ్వడీ! యందునున్ నెఱి గలుగవేని,
ననువుపడి కర్మయోగమ్ము నా(శయించి
నియతచిత్తుఁడవై, మీఁద నిఖిలకర్మ
ఫలములను సంన్యసింపుము పరమమందు. 7

విను మిటు, లభ్యాసముకం
టెను జ్ఞానము, దానికంటె నెక్కుడు ధ్యానం
బును, దానికంటె (శేయో
జనకము కర్మఫలసంన్యసనమును బార్థా! 8

సర్వకర్మఫలమ్ములు సంన్యసించి
వైచి మత్పరముఁడ వయి పరగనేర్చు
నెడల సంసారసరణి, తద్ధేతుభూత
మైన యజ్ఞానభూతమ్ము, నడఁగిమడఁగు. 9

ఎల్లభూతముల ద్వేషింప నొల్లనివాఁడు,
మిత్రభావమ్మున మెలఁగువాఁడు,
కరుణారసమ్మునఁ గఱఁగుడెందమువాఁడు,
మమత కా(శయ మీని (క్రమమువాఁడు,
నెఱి నహంకారమ్ముఁ దఱిమివైచినవాఁడు,
సుఖదుఃఖముల సమస్ఫూర్తివాఁడు,
తాలిమి సొమ్ముగాఁ దనర నేర్చినవాఁడు,
నిత్యసంతుష్టుఁడై నెగడువాఁడు,

యోగి యపువాఁడు, నియతాత్ము మొనరువాఁడు,
సుదృఢనిశ్చయమ్మునవాఁడు, సొరిది మనసు
బుద్ధి నాయందు విడుకొని పొదలువాఁడు,
నైన నాదుభక్తుఁడు ప్రియుఁడయ్య! నాకు. 10

ఎవ్వనివల్ల లోక మొకయించుక యంచుక బాధ నొందదో,
యెవ్వఁడు వ్యాకులంపడి తపింపఁడొ లోకమువల్ల నెన్నఁడే,
నెవ్వఁడు మోదముంగినుక నీసుభయమ్ముఁ జికాకుఁద్రోయుఁడా
నవ్వల, నాదుభక్తి గలయాతఁడు నాకుఁ బ్రియుండు పాండవా!

తలఁప నపేక్ష లేని సముదారుఁడు, లోపల బైట శౌచముల్
గలయతఁడున్, సమర్థుఁ డగుకర్మములందుఁ, దటస్థుడున్, వ్యథల్
దలఁగినతండు, నెల్లపనులన్ ఫలముల్ విడనాడినాతఁడున్,
వలనొనునాదుభక్తిఁ బ్రవిభాసిలునాతఁడు నా కభీష్టుఁడౌ. 12

చెనయక మోదము ఖేదము
మనమున ద్వేషమ్ముఁ గోర్కె, మఱిమఱి దూర
మ్మున విడిచి శుభాశుభముల,
ననిచిననాభక్తజనుఁడు నాకుఁ బ్రియుండౌ. 13

మానక శత్రుమిత్రులెడ మానమునం దవమానమందు స
మానమతో సమానమగు మానసఁ, జల్లఁదనమ్ము వేఁడిమిన్,
బూనికదుఃఖమున్ సుఖముఁ, బోల్కెనొకందుగఁ జూచి, సంగమున్
మానిన నాదుభక్తజనమాన్యుఁడు నాకుఁ బ్రియుండు ఫల్గునా!

పొగడినఁ దెగడిన నొకఁడై,
మొగకొని మౌనమునఁ, దుష్టిఁ బొరసినదానం

దగి, యనికేతుఁడు, స్థిరమతి,
యగు నాభక్తుండు నాకు నధికప్రియుఁడౌ. 15

ధీనిధి! ధర్మ్యము నమృతము
దీనిం గడు శ్రద్ధతో ధృతిన్ మత్పరులై
పూని యథోక్త ముపాసకు
లౌ నాభక్తు లన నాకు నతితర మిష్టుల్. 16

ఇది పంద్రెండవ్వధ్యాయము.

# పదుమూఁడవ యధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

మిత్రమ! ఈ దేహమ్మును
క్షేత్ర మనియు, దీనిఁ దెలిసి చెలఁగెడువానిన్
క్షేత్రజ్ఞుఁ డనియు నందురు
క్షేత్రక్షేత్రజ్ఞవిదులు సిద్ధాంతమునన్. 1

క్షేత్రములం దెల్లం గల
క్షేత్రజ్ఞుఁడు నేనెసుమ్ము; సితహయ! క్షేత్ర
క్షేత్రజ్ఞవిభాగంపుప
విత్రజ్ఞానమ్ము నాకుఁ బ్రియతమ మెంతేన్. 2

క్షేత్ర మది యెట్టిదో, యేవికృతులు గలదో,
తనరునో దేనివలన, క్షేత్రజ్ఞుఁ డనఁగ
నెవ్వఁడో, యెట్టిపేరిమి నెసఁగువాఁడో,
సరవిఁ దెల్పెద, నది విను సంగ్రహముగ. 3

పార్థ! ఇది మహర్షులచేతఁ బలుతెఱఁగుల,
వివిధములు ఛందములచేత వేఱువేఱ,
లెస్స వెలసి సందియములు లేని బ్రహ్మ
సూత్రపదములచేతను, సుకథితంబు 4

తలఁప, మహాభూతములు, నహంకారమ్ము,
నధ్యవసాయమయమ్ము బుద్ధి,
అవ్యాకృతముపేర నమరుమాయాశక్తి,
మనసుతోఁ గూడి పదునొకఁడైన
లెక్కకు సరిపడి త్రిక్కని జ్ఞాన క
ర్మేంద్రియములును, జ్ఞానేంద్రియముల
కగ్గము లవునట్టి వయిదు శబ్దాదులు,
చొప్పడుతమి, పగ, సుకము, దుక్క,

మవల, దేహేంద్రియములప్రో, వందు నమరి
వెలుఁగుచేతన, పైప్రోవు నిలువఁబెట్టు
శక్తి, యిది యంతయును సమాసమ్మున సవి
కార మైన క్షేత్రం బని కథిత మయ్యె. 5

అనఘ! ఆత్మస్తుతియందుఁ గోరిక లేమి,
డంబపుఁద్రోవ మనంబు నిడమి,
ప్రాణిహింసనమునఁ బరగమి, తాలిమి,
యెసఁగునార్జవమున నిచ్చ విడమి,
ఆచార్యసంసేవనభిరతి, వెలుపల
లోపల శౌచమ్ముగాపు గడన,
మోక్షమార్గమునందు మొగకొనుస్థిరభావ,
మాత్మనిగ్రహమున నాగ్రహంబు,

ఇంద్రియార్థసమితియెడ మాఱుమొగ, మహం
కారవైఖరి కెడ గలిగి మనికి,

ప్రబలజన్మమృతిజరావ్యాధిదుఃఖదో
షానుదర్శనమ్మునందుఁ బూన్కి, 6

విషయజాలములందుఁ బ్రీతి సేయమి, పుత్త్ర
దారగృహాదులఁ దవులువడమి,
కలుగునిష్టానిష్టముల నిచ్చ సమ మయి
వెలయుచిత్తమ్మున మెలఁగునేర్మి,
అనయమ్ము నాయందు ననన్యయోగమ్మున
వ్యభిచరింపని పెద్దభక్తి సేఁత,
తవిరి వివిక్తప్రదేశమ్మునన్ మన్కి,
జనసంఘముల రతిఁ గొనఁగఁ జనమి,

సతత మాత్మాదివిషయకజ్ఞానమందు,
దవులు, తత్త్వవిజ్ఞానార్థదర్శనమ్ము,
నిద్ది జ్ఞానంబు నాఁబడు; నింతకంటె
భిన్న మెల్ల నజ్ఞానంబు; వింటె పార్థ! 7

ఎఱిఁగికోఁ దగు నెది, దేనియెఱుకచేత
నమృతము లభించుఁ, దెల్పెద నదియె, విను; మ
నాదిమంతము పరము బ్రహ్మమ్ము తాదృ
శమ్ము; కా దని సత్తు నసత్తు విజయ! 8

ఎల్లెడలఁ గాలుసేతులు, నెల్లయెడలఁ
గనులు, తలలు, మొగమ్ములు, గలిగి, యెల్ల
యెడలఁ జెవులతో బ్రహ్మ మ దెల్లచోటు
లావరించి వెల్గుచునున్న దర్జునుఁడ! 9

సవ్యసాచీ! సదా సర్వేంద్రియగుణావ
భాస మయ్యును బరబ్రహ్మ మదియుఁ,
బొదలి సర్వేంద్రియములును లేనిది, సర్వ
సంశ్లేషరహితంబు, సర్వగతుల
సర్వమ్ము ధరియించు, సత్త్వరజస్తమో
గుణములు లేనిది, గుణపుఁబనుల
కేపారు సాక్షియై, యెల్లభూతమ్ముల
వెలుపల లోపల వెలసియుండు,

స్థావరము జంగమమ్మును జాల సూక్ష్మ
మవుట నెఱుక కందనియది, తవిలి దవుల
దవుల నజ్ఞజనులకు, విద్వాంసులైన
వారి సరసన వెన్నంటి వరలుచుండు. 10

ఆకసమ్ముపోలె నంటియుండి యెవేళ
వేఱుపఱుప నంత వీలుపడని
దయ్యు, భూతతతులయందు వేఱై నది
పోలె బ్రహ్మవస్తు వొలిఁ గ్రాలు. 11

భూతజాతములను బ్రోచి మోచుట, మ్రింగి
గబ్బుమనఁగఁ ద్రేఁచి కడలుకొనుట,
వెండి పొడమఁజేసి వెలయించుటయుఁ దదు
ద్యోగమయ్య, ధర్మయోజితాత్మ! 12

పార్థ! ఆదిత్యుఁ డాదిగాఁ బరగునట్టి
జ్యోతులకు నెల్ల నది పెద్దజ్యోతి సూవె;

ఎసఁగునజ్ఞాన మను పేర నెగసి కవిసి
క్రమ్ము కాఱుచీఁకటికంటెఁ గడుఁ బరమ్ము. 13

లలితుఁడా! అమానిత్వాదిలక్షణములఁ
జెలఁగుజ్ఞానమ్ము, నద్దాని జ్ఞేయమైన
బ్రహ్మమును, జ్ఞానఫలమైన బ్రహ్మము, నన
నీ త్రికము నిల్చుఁ బ్రతివానిహృదయమందు. 14

ఓయీ! క్షేత్రము జ్ఞానము
జ్ఞేయము సంగ్రహముగా వచించితి; దీనిం
డోయ కెఱిఁగి మద్భక్తుఁడు
హాయిగ మద్భావ మెనయునర్జున కగుఁజా. 15

అనఘ! ప్రకృతియుఁ బురుషుండు ననఁగ రెండు
నాది లేనివ యని మది నరయుమయ్య!
లలి వికారమ్ములును గుణములును బ్రకృతి
వలనఁ గలుగుచుండు నటంచుఁ దెలిసికొనుము. 16

తమి దేహేంద్రియసంఘా
తము సమకూరుపఁ బ్రకృతి కర్త మ్మగు; సుఖదుః
ఖముల సదానాక్షాత్కా
రమునం బురుషుఁడు కర్తము; ప్రథితయశస్కా! 17

ప్రకృతిస్థుం డయి పురుషుఁడు
ప్రకృతిఁ బొసంగెడుగుణముల వరుసం గొను; వా
నికి గుణసంగము నెఱు లో
ముక సదసద్యోనిజన్మములకుఁ గతం బౌ. 18

ప్రకృతిపరుఁడైన పురుషుఁ డీ సకలదేహ
మున నుపద్రష్ట, అనుమంత, భోక్త, భర్త,
యై, మహేశ్వరుండును బరమాత్మయు నని
శ్రుతులఁ గీర్తింపఁగాఁ బడుచున్నవాఁడు. 19

పార్థ! గుణములతోఁ గూడఁ బ్రకృతిపురుష
తత్త్వ మెఱిఁగికోఁ జాలువిద్వద్వరుండు
సర్వథా వర్తమానుఁడై సాగుచున్నఁ
దిరిగి దేహాంతరమ్మును బొరయఁబోఁడు. 20

కొందఱు సంస్కృతాత్మమును, గొందఱు జ్ఞానవిధాననిష్ఠయుం,
గొందఱు సాంఖ్యయోగమును, గొందఱు బ్రహ్మకునర్పణంబుగాఁ
గ్రందుకొనంగనై సలుపుకర్మములందు నిరూఢిఁ, బూని పౌ
రందరుఁడా! యెఱింగికొని రాజిల నేరుతు రాత్మవస్తువున్. 21

మఱి కొలుతు రిట్టి తెఱఁగుల
గుఱు తెఱుఁగక గురులవల గుఱుతుగ విని కొం
దఱు; వినికిం బొదలియు వా
రఱిమురి మృత్యువును దాఁటి యరుగుదు రనఘా! 22

తలఁపఁ జరాచరమయమై
చెలఁగెడుసత్త్వమ్మ దెల్ల క్షేత్రక్షేత్ర
జ్ఞులసంయోగమువలనన
కలుగు నటం చెఱిఁగికొనఁగఁ గలుగుము పార్థా! 23

భూతము లడంగుచున్నను
బ్రాతి నడంగక వెలుఁగుచు వర్తిలి సమతా

స్థితుఁ బరేశ్వరుఁ గనుఁగొను
నాతఁడు లెస్సగఁ గనంగలాఁతఁడు విజయా! 24

సర్వభూతములందును సంస్థితుం బ
రేశు సమభావమునఁ దిలకించువాఁడు
తనకుఁ దా నాత్మనాశనమును బొనర్చి
కొనఁడు; లెస్స పరాంగతిం గొనఁగలాఁడు. 25

ఎల్లగతులఁ బ్రకృతియె గావించుచుండుఁ
గర్మములనెల్లఁ, బురుషుండు కర్త గాఁడు,
నిక్క-; మరి నిచ్చలుం జూడ నేర్చుసుమహి
తుం డొకండె సమ్యగ్దర్శనుండు పార్థ! 26

భూతములు వేఱువేఱయ్యుఁ బొదలి యొక్క-
యాత్మమునయందె స్థితి నొంది యలరుచున్న
వనుచుఁ దెలిసికొఁ గలిగిన యనుపదంబ
పొందు విస్తారమౌ బ్రహ్మమును బుధుండు. 27

నూల్కొని యనాదియును నిర్గుణుండు నగుట
నర్జునా! పరమాత్మ యవ్యయుఁడు సుమ్ము;
కాన, సంస్థితిఁ గొనియును మేన నతఁడు
చేయఁ డెది, దోషములచేతఁ బూయఁబడఁడు. 28

సర్వగత మయ్యు నెటు లాకసంబు సూక్ష్మ
మవుట నితరవస్తువులచే నంటఁబడదొ,
అటులె యెల్లెడ సంస్థిత మయ్యు నాత్మ
వస్తు వేయంటుసొంటును బలిసి కొనదు. 29

జోఁక నీయెల్లలోకమ్ము సూర్యుఁ డొక్క-
రుండె వెలుఁగఁజేయుచు నున్న రూపు దోఁప
క్షేత్రమును నెల్ల నల్లన క్షేత్రి యొకఁడె
కడుఁ బ్రకాశింపఁ జేయుచుండెడుఁ గిరీటి! 30

ఎంతయు క్షేత్రక్షేత్ర
జ్ఞాంతరము, నవిద్యతోడ నంటువడమి, నీ
వంతున జ్ఞానపుకంటం
బంతుగఁ గనువాఁడు పరము బ్రహ్మముఁ బడయున్. 31

ఇది పదుమూఁడవు నధ్యాయము.

# పదునాలుగవ నధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము

మరలఁ దెల్పెదఁ బరమమహా సరణి, వినుము,
జ్ఞానముల కెల్ల నిది తలమానికమ్ము;
తెలిసి యిద్దాని మును లెల్ల దేహబంధ
మెడలఁ బరమసంసిద్ధినిఁ బడసినారు. 1

నిరత మీజ్ఞానమున నిష్ఠ నెఱయ నిలిచి
నాదుసాధర్మ్యముం గొన్న నంద్యమతులు
మరల సృష్టికాలమ్మున మలసి పొడమఁ
బోరు, లయకాలమున వెత మునుఁగఁ బోరు. 2

ప్రకటముపడి త్రిగుణములం
బ్రకృతి యనంబడెడునట్టి మన్మాయాశ
క్తి, కిరీటి! మహీయసి; అది
యొకటే భూతముల కెల్ల యోని; విను మిటుల్. 3

తాలిమి హిరణ్యగర్భుని
మూలమ్మున నెల్లభూతములకుఁ గతంబౌ
వాలాయపుబీజమ్మును
నే లీలం దానియందు నిక్షేపింతున్. 4

లలి క్షేత్రక్షేత్రజ్ఞుల
కలయికచే నైనయట్టి గర్భాధానా
మలదీక్ష నెల్లభూత
మ్ములపుట్టుక పొసఁగునయ్య పురుహూతసుతా! 5

అఖిలయోనివిశేషమ్ములందుఁ బుట్టు
సకలమూర్తివిశేషమ్ములకును బ్రకృతి
శక్తియే సాఁకతముఁగ నెసంగుతల్లి,
నేను బీజమ్ముఁ గూర్చుతండ్రిని, సితాశ్వ! 6

కన సత్త్వరజస్తమములు
గొనములు ప్రకృతివలనఁ బొసఁగునవియు; సితవా
హన! అవి యవ్యయుఁ డౌ దే
హిని దేహమునందుఁ గట్టియిడు నెఱి బొరయన్. 7

ఆ గుణత్రయమ్మునందు నిర్మల మౌట
సత్త్వగుణము లెస్స సంప్రకాశ
కమ్ము; దాని కెందుఁ గలుగ దుపద్రవ
మన్నమాట, యేరవంత; పార్థ! 8

విషయమైన సుఖము విషయియౌ నాత్మయం
దదుకునఁ దవులాట మంటఁగట్టి
యటులె జ్ఞానసంగ మమరించి బంధించు
దేహి నాగుణమ్ము దేహమందు. 9

అర్జునా! రజోగుణము రాగాత్మకంబు,
భూరివిషయతృష్ణాసంగములకు మూల

కంద; మది యందు దేహిని గ్రస్తుఁ జేసి
కర్మసంగసూత్రమ్మునఁ గట్టివైచు. 10

చెరసి యెల్లప్రాణుల మోహపెట్టుతమము
నెఱయు నజ్ఞానమున నని యెఱుఁగికొనుము;
నెగడినఁ బ్రమాద, మలసత, నిదుర యన్న
గుణములబలమ్మున నది బద్ధునిఁ బొనర్చు. 11

సత్త్వగుణము సరవి సమకూర్చు సుఖమున;
రజము కర్మమందు రక్తిఁ గూర్చు;
మూసి పెట్టి జ్ఞానమును, దమోగుణము ప్ర
మాదమందు ముంచి మలయఁజేయు. 12

అనఘ ! రజమును దమమును నణఁచి సత్త్వ
మటులె సత్త్వముఁ దమమును నణఁచి రజము,
రజము సత్త్వము నణఁచి బిరానఁ దమము,
నెగడి తమతమ పనులను నెఱపుచుండు. 13

నెలకొని యెపు డఖిలేంద్రియ
ములందు జ్ఞానముఁ బ్రకాశమును నీమేనన్
విలసిల్లు, నపుడు సత్త్వం
బెలమి వివృద్ధం బటంచు నెఱుఁగుము పార్థా ! 14

వినుము రజ మ్మతిశయమును
గనునెడ, లోభము, ప్రవృత్తి, కర్మారంభం
బునఁ దమి, చిత్తము నిలువమి,
పెనఁగంబడి విషయతృష్ణ, బెరయును విజయా ! 15

తమ మధికారముఁ గొనునే
మమున, వివేకమ్ము లేమి, మాంద్యమ్ము, ప్రమా
దము, మాథ్యము, మున్నైన గు
ణములు పొసంగును సురేంద్రనందన! వింటే? 16

సత్త్వ మభివృద్ధిఁ గొనియున్న సమయ మందు
దేహముం బాసి మృతి నొందు దేహధారి
పెరిమ మెయి మహోత్తమతత్త్వవేత్త లరుగు
విమలలోకమ్ములను బొంది వెలయఁగలఁడు. 17

నెఱి రజోగుణ మేపారు తఱినిఁ బ్రలయ
మొందునతఁడు కర్మాసక్తులందుఁ బుట్టుఁ;
దమమునన్ మృతిఁ గొన్నయతండు మూఢ
యోనులందును బుట్టు; ననూనయశుఁడ! 18

కడలుకొని సాత్త్వికమ్మైన కర్మమునకు
నిర్మలము సాత్త్వికము నయి నెఱయుసుఖము,
రాజసమునకు దుఃఖముఁ, బ్రబలతామ
సమున కజ్ఞానమును, ఫలితముగ నండ్రు. 19

జానుగ సత్త్వమువలనన్
జ్ఞానమ్ము, రజోగుణమ్మునన్ లోభం, బెం
తేనియుఁ బ్రమాదమోహా
జ్ఞానమ్ములు తమమువలన, జతపడు ననఘా! 20

సమ్మతి జ్ఞానముం బొదివి సాత్త్వికవృత్తులు గొందు రూర్ధ్వలో
కమ్ములఁ; మర్త్యలోకములఁగాంచుచునుందురు పుట్టు రాజసుల్;

క్రమిస్త్ర జఘన్యవృత్తముల రాపిడి దేలిన తామసుల్ జఘ
న్యమ్ముల యా నధోగతులయందుఁ గృశింతురు; నిక్కమర్జునా!

గుణములె సర్వకర్మములకుం గల కర్త లటం చెఱుంగనై
గుణములకంటె నన్యుఁనిగ గుర్తునఁ గర్తను జూడఁబోఁడు, త
ద్గుణముల కెల్ల సాక్షి యయి తోఁచు పరాత్మ నెఱుంగనేర్చు నే
క్షణమున, ద్రష్ట, ఆక్షణమ కైకొనఁ గల్గు మదీయభావమున్.

దేహములకుఁ గారణము లీత్రిగుణములను
నుపుఱుకొ నున్నయప్పుడ పొసఁగి దాఁటి
జన్మమృత్యుజరాదుఃఖజాలవలయు
ముక్తుఁడై దేహి యమృతముఁ బొందుఁ బార్థ! 23

ఏయేగుర్తులతోడఁ జూడఁబడు లక్ష్మీశా! గుణాతీతుఁ? డే
యే యాచారములం దిరమ్మొపడు వాఁ? డీమూఁటినిం దాఁటు నే
చా సుంబోయి జనుండు? నాకుఁ గృప హెచ్చం దెల్ప వేయంచు గాం
తేయుం డెంతయు వేఁడుకోఁ, బలుకఁ బూనెన్ దేవదేవుం డిటుల్

కజ్జి! సత్త్వరజస్తమఃకార్యగతులు
తొలఁగక స్వవృత్తులం బూని మెలఁగుఁగాక,
మనిని ద్వేషింపఁ డవ్వాని; మరలి చనును
గాక, కోరఁడు గుణముల గడచినతఁడు. 25

అరయ నుదాసీనుఁడట్లు లాసీనుఁడై
గుణములయూఁపునఁ గుతిలపడఁడు,
గుణములే వికృతులఁ గొనుచుండు నను నిశ్చ
యంపుపెంపునఁ దాఁ జలింపఁబోఁడు,

సుఖమును దుఃఖమ్ము నొకభంగిఁ జూచుచు
స్వస్థచిత్తమ్మునఁ బరగియుండుఁ,
దలఁపున బంగారు గులకరాలును మన్ను
సలుపుచు నొకపోల్కిఁ గలఁగకుండుఁ,
ప్రియము నప్రియమును దనపయినిఁ బడిన
దను బొగడినఁ దెగడినఁ దాఁ దొణఁకఁబోఁడు,
గౌరవమ్మును మఱియు నగౌరవమ్ముఁ
గూరిచిన నొక్కఁడుగ సాగు, ధీరుఁ డతఁడు. 26

వానికి మిత్రులు శత్రులుఁ
గానం బడ రెండు, నెల్లకర్మములుఁ దా
మాని విడనాడు వాఁడు; ప
రానందమె పరముసూ గుణాతీతునకున్. 27

వ్యభిచరింపక దృఢమైన భక్తియోగ
మున స్థితుం డయి సేవించి నను భజించు
నంచితాత్ముఁ డీగుణముల నొంచి దాఁటి
బ్రహ్మభూయమ్ముఁ బడయున న్నాత గడించు. 28

కౌంతేయా! వ్యయరహిత, మ
నంత, మ్మమృతమ్ము, ధర్మ, మమలసుఖం, బే
కాంతిక, మా బ్రహ్మమునకు
నెంతేనిం దవుప్రతిష్ఠ నేనె గదయ్యా! 29

ఇతి పదునాలుగవ యధ్యాయము.

# పదునైదవ నధ్యాయము

## పురుషోత్తమ యోగము

ధర్మజానుజ! సావధానమనస్కుఁడ
వై విను మశ్వత్థ మనెడు పెద్ద
వృక్షరాజ మొకండు విలసిలు; మాయామ
యము దానిసంస్థాన మబ్బురంబు;
ఊర్ధ్వమూలము దాని కొనరినకొమ్మలు
క్రిందులు; కల యెల్ల ఛందములును
బర్ణమ్ము; లది సాగి వచ్చుచున్న దనాది
కాలమ్మునుండియుఁ గూలిపోక;

పెరుగునే గాని తఱుఁగదు వీసమంత;
నిట్టనిలువు బలిష్ఠమై నెగడు నిచ్చ;
తెలమి విశ్వచ్ఛేఁడా! దీనిఁ దెలియఁ గలుగు
వాఁడు వేదముల్ దెలిసినవాఁడె సుమ్ము. 1

చెలఁగి గుణమ్ములచేతఁ బ్రాఁతిగఁ బెంపఁ
బడి దానికొమ్మలు వమ్ముగాళ
మేకొని క్రిందికి మీఁదికి వే సాగి
వ్యాపించియున్న వనంతములుగ;

శబ్దాదివిషయసంజ్ఞలు లైన కొంగ్రొత్త
యివ్వళులతో నవి యెసఁగుచుండుఁ;
గ్రింద మానవలోకమందు ధర్మాధర్మ
లక్షణకర్మమూలములు లెస్స
నాటుకొని యున్న; వారూపునన యిహమ్ము
నందు నా చెట్టు కనఁబడ దెందు నెపుడు;
దానికిం దుది మొదలు సంస్థాన మన్న
మాట యొకనాఁటఁ దెలివిడిం బడదు పార్థ! 2

సువిరూఢమూలమై మివులు న య్యశ్వత్థ
వృక్షమ్ముఁ గూఁకటివ్రేళ్ళతోడఁ
దెంగున దృఢమా నసంగశస్త్రమ్మునఁ
గఱకఱి నఱికి రూపఱుచునవల
వెదకికోవలె లెస్స, విమలమా నెద్దానిఁ
జేరుకో నేర్చినవారు మరల
సంసారమునకుఁ గాల్ సాగించి వేంచేయ,
రా బ్రహ్మపదము ననంతసుఖముఁ;
బూని యత్తఱినిఁ బురాణమాయాశక్తి
యెవనివలనఁ బొసఁగి యెసఁగె నట్టి
పరమపురుషు నాద్యుఁ బడసెద సర్వాత్మ
నే యటంచుఁ దలఁపు సేయవలయు. 3

ఎడసి మానమోహములకుఁ, దుడిచి సంగ
దోష, మధ్యాత్మనిత్యులై, తొలఁచి కామ

ముఁను, గెలిచి ద్వంద్వముల, నిర్మోహు లైన
ధన్యు లవ్యయంబైన తత్పదముఁ గొంద్రు. 4

కౌరవ! సహస్రకరసం
భారుఁడుఁ దారాధవుండుఁ బావకుఁడుం, దే
జోరూపము నాధామము
లేరు ప్రకాశింపఁజేయ లేశంబేనిన్. 5

పాండుపుత్త్రి! వింటె, పరగ నెచ్చోటికి
నరిగి మరల నిందుఁ దిరిగి రారో,
అవ్యయంబు పరమ మదియె నా వైష్ణవ
ధామమయ్య; అదియె భూమమయ్య! 6

జీవలోకమందు జీవుండు నాఁబడి
సతము వ్యవహరించునతిసనాత
నంబు తేజ మరయ నాదుదివ్యాంశమే
యనుచు లెస్స తెలియుమయ్య పార్థ! 7

తమతమ నెలవులఁ గొని యుం
డి మనఃషష్ఠమ్ములైన నిఖిలేంద్రియబృం
దము లాకర్షించి నిజో
త్క్రమమున జీవుండు వెంటఁ గైకొని యేగున్. 3

దేహ యానీశ్వరుం డొక దేహమందుఁ
జొరునపుడు, దేహముం బాసి యరుగునపుడు,
వెంటఁ గొని యేగు నవ్వాని, వింటె, యాశ
యముననుండి తా గాలి గంధములనటులు. 9

అమరి చెవిం గన్నుం జ
ర్మమునున్ నాలుకను ముక్కు మనము నధిష్ఠిం
చి మెలవునన్ జీవుఁడు విష
యములన్ భోగించుచుండు నమరేంద్రసుతా ! 10

మేను విడుచునప్పుడు, నందు మెలఁగునపుడుఁ,
గుడుచునపుడును విషయముల్, గుణములఁ బడి
మునుఁగునపుడును, దేహిని మూఢజనులు
చూడ నేరరు, జ్ఞానచక్షువులు దక్క. 11

యతనమున మొనసి సుసమా
హితచిత్తముతోడి యోగు లీయాత్మను స
మ్మతి స్వస్వరూపమందే
స్థితునిఁగఁ దిలకింప నేర్చి చెలఁగెద రనఘా ! 12

యతనించుచుండియు సుసం
స్కృతచిత్తులు కానివారు గిరికొనునవివే
కతరంగమ్ములలోఁ బడి
ధృతి సెడి యీ యాత్మ నెపుడుఁ దెలియరు పార్థా! 13

కన్నులు విప్పి యొప్పఁగ జగమ్ములకుం గనుఁ దెల్వి వెల్గునుం
బన్నుగఁ గూర్చి పేర్చు నల భాస్కరునందును, జంద్రునందు, నే
జన్నమునందుఁగాని విలసద్రుచిఁ దోఁచుకృశానునందు, సం
పన్నత వెల్గుతేజ మది మామకమే యని నీ వెఱుంగుమా. 14

రాజిలునోజను పెంపున
నే జగతిం జొచ్చి భూతనికరము మోత్తున్ ;

ఓజ రసాత్మకసోముఁడ
నై జవ మేపారఁ బెంతు నఖిలౌషధులన్. 15

ప్రాణులనెమ్మేన్ వై
శ్వానరభావమున నమరి, వలగొనుప్రాణా
పానముల నేఁ జతుర్విధ
మౌ నన్నమును బచనమున నఱిగింతు వెసన్. 16

ఏనె సమస్తభూతములహృత్కుహరమ్ముల నిల్చియుంటి; నెం
తేనిఁ బొసంగు నావలననే స్మృతి, జ్ఞాన, మపోహనమ్ము; నే
నే నెఱి వేదవేద్యుఁడను; నేన వెలార్చితి వేదశీర్షముల్;
నేనె సమస్తభూతములు లెన్న యెఱింగినవాఁడ; నర్జునా! 17

క్షరుఁ డన నక్షరుఁ డన నిరు
వురు పురుషులు లోకమందుఁ బొడకట్టుదు; రం
దరయఁగ భూతము లన్నియు
క్షరుఁ డనఁబడుఁ; గూటమందుఁ గలఁ డక్షరుఁడున్. 18

ఒనరి యీ క్షరాక్షరరాశియుగముకంటె
వేఱుగా నొక్క పురుషుండు వెలసియుండు;
నుత్తమోత్తముఁ డవ్వాని కొక్కనాఁడు
వ్యయ మనెడుమాట పొసఁగ, దీశ్వరుఁ డతండు. 19

పరమాత్ముఁ డనంబడున
ప్పురుషోత్తముఁ డాత్మశక్తిఁ బొనరుపడం జె
చ్చెర నావేశించి సదా
పురుమహిమ భరించుచుండు ముల్లోకములన్. 20

కురుకులుఁడ ! క్షరాక్షరు లి
ర్వురకంటె నతీతుఁడం బరుఁడ నుత్తముఁడన్
నెరిఁ, గాన నే నెసంగితిఁ
బురుషోత్తముఁ డనఁగ లోకమున వేదమునన్. 21

పడి మోహతమోహతి మతి
నెడ కిటు పురుషోత్తముఁ దెలిసికొను నతు నె
వ్వాఁడు, వాఁడు సర్వవిదుఁడై
వడిఁ బడయుం గలఁడు సర్వభావమున ననున్. 22

అతిరహస్యమైన యట్టి యీశాస్త్రమ్ము
నీకుఁ దెలిపినాఁడ నెనరుఁ జేసి;
పొసఁగ దీనిఁ దెలియ, బుద్ధిమత్త్వముఁ గృత
కృత్యతయు లభించు; సత్య; మనఘ ! 23

ఇది పదునైదవ యధ్యాయము.

# పదునాఱవ యధ్యాయము

## దైవాసురసంపద్విభాగ యోగము

మేకొని భయము లేమియు, సత్త్వసంశుద్ధి,
జ్ఞానయోగములం దనూననిష్ఠ,
దానమ్ము, దమము, శ్రౌతస్మార్తరూపము
లైన యజ్ఞములు, స్వాధ్యాయనిరతి,
తప, మార్జవము, నహింసఁ దవిలి వర్తిలఁబోమి,
సత్యము, కినుక కాస్పదము గామి,
త్యాగబుద్ధి, శమమ్ము, దోఁగమిఁ బిశునత,
నిఖిలభూతములందు నెనరు సేఁత,

లోలుపుఁడు గామి, మృదుత, నూల్కొనెడుసి, గ్గ
చాపలము, తేజముం, దాల్మి, శౌచము, ధృతి,
పూనమియు ద్రోహమును, నాతిమానితయును,
బట్టుపడు దైవసంపదం బుట్టుదణికి. 1

డంబం బతిమానము ద
ర్పంబును క్రోధంబు పరుషవాక్యము లజ్ఞా
నంబును నాసురసంపద
లం బుట్టినమానిసికి నలవడును బార్థా! 2

దైవీసంపద మోక్షపుఁ
ద్రోవకు, బంధమున కాసురీసంపద యౌ;
దైవీసంపద పొదలఁగ
నీ వర్జున! పుట్టినాఁడ; విఁక వగవకుమా. 3

దైవ మన నాసుర మ్మనఁ దవిలి రెండు
భూతసర్గమ్ము లీలోకమున నెసంగు;
నందు, దైవసర్గము లెస్స ముందె తెలిపి
నాఁడ, నాసురసర్గమ్ముజాడ వినుము. 4

విధినిఁగాని, నిషేధపువిధముఁగాని,
గుర్తెఱుఁగ రాసురజనుల్ కొండిక లయి;
వారియెడ శౌచమేని, నాచారమేని,
సత్యమేని, శూన్యము లయ్యె సవ్యసాచి! 5

ఈప్రపంచము మిథ్య, యిది యంతయు హుళక్కి,
లేదు ధర్మాధర్మవాద మిందు,
నీశ్వరుం డనునాతఁ డిద్దానికా లేఁడు,
రేకెత్తి తలకొన్న స్త్రీపురుషుల
కామోపభోగమ్ముకతమున రూపొంది
తనరె నటన్న సిద్ధాంతమూల
కందము కామమ్ము గాక మఱొక్కఁడా?
యను చూపునం బడి యనద లవుచు

వెసఁ బ్రణష్టాత్ము లై, బుద్ధి కసవు గఱచ,
నుగ్రకర్ములు, జగముల కుడుగనిపగ

తుఱును నై జగమ్ములచేటుకొఱకుఁ బుట్టు
చుందు రాసురసంపదలందు ఖలులు. 9

దంభమానమదమ్ములఁ దవిలి, దుష్
పూరమౌ కామకూపారమున మునింగి,
మోహమునన అసద్గ్రాహములను బూని
మెలఁగుదు రశుచివ్రతశతమ్ములన వారు. 7

అంతమే లేక కడుఁ బ్రలయాంతమైన
చింత దిగఁబాఱి, కామనిషేవణంబె
జన్మపరమావధిగ నెంచి, సాగి యటులె,
పొలియుచుందు రాసురసంపదలు గలారు. 8

వలగొను కామక్రోధ
మ్ముల నాశాపాశసమితి ముప్పిరి వడి, య
న్యులయర్థము లన్యాయమ
బలిగొందురు కామభోగపరు లవ్వారల్. 9

ఇది పొందితి నే నిపుడే,
యిది పొందుమనోరథం బెయిది యిఁక నా, కి
య్యది వలసినయది, ధన మి
య్యది సమకూరంగ నున్న దంతయు మరలన్. 10

తెగటార్చితి నీపగతునిఁ,
దెగటార్చెద మిగిలియున్న ధృష్టులసైతం,
బాగి నీశ్వరుఁడను, భోగిని,
తగుసిద్ధుఁడ బలిని, సుఖిని, ధరపయి నేనే. 11

ధనవంతుండఁ, గులీనుఁడ,
నెన వచ్చునతండు నాకు నేఁడీ? యజనిం
చింతు, నటాదుల కిత్తు, ముదం
బును గొందుం, దిందు, విందు మొగి నిష్టమ్ముల్. 12

ఐ, కామమ్ములకడు పోకఁ
జే కొని పరమార్థముగ నెయిది, నాసురు ల
న్నా! కూలుదు రల కుంభీ
పాకాదిక ఘోరనరక పద్ధతులందున్. 13

అర్జునా! వేయేల? యాత్మసంస్తుతి యొండె
యునుగ కవ్వారియుద్యోగమయ్య,
నీతితో జాతితో నెఱయుకర్జపుఁద్రోవ
యెదియు వారికిఁ గనపింపదయ్య,
ధనమానమదములదమ్ములు దర్పముల్
వెన్నతోఁ బెట్టినవ్వియుగదయ్య,
విధి మాని దంభమే విధిగాఁగ యజనింప
నామయజ్ఞములతో ననుతురయ్య,

ఆోమ్ముబల, మహంకారగర్వమ్ము, కామ
కారముం, గ్రోధమును, నూఁతగజ్జలయ్య,
ఆత్మపర దేహములయందు నలరునన్ను
ద్వేషమున నీసు దొడిగి నిందింతురయ్య. 14

మంగలము సేసి శౌచ, సుమంగలు లయి,
కాని తెరువులఁ జొరఁ బాఱి, క్రౌర్యమునన



వర్తిలునరాధముల వారిఁ బాఱవైతుఁ
బూని కలకాల మాసురయోనులందె. 15

ఆసురయోనులందె పడి యమ్మెయి నాఱుచు జన్మజన్మముం
గాసిలి గ్రుగ్గి క్రుగ్గుచుఁ జికాకయి యంతు నెఱుంగఁబోక స
న్న్యాసులు వారు మూఢు లయి నాదరిఁ జేరమి యట్టులుండ, సం
వాసన నింతకంటె నధమస్థితి నొందుదురయ్య ఫల్గునా! 16

కామము క్రోధము లోభము
నా ముత్తెరువులఁ దలిర్చు నరకద్వారం;
బో మఱిగొను నాత్మనాశన
మీమూఁటం గాన వే త్యజింపగవలయున్. 17

తమమునకు దారు లీమూఁ
డు మేలపునఁ ద్యజించునతఁడు డొంకక స్వశ్రే
యము నాచరించి దానం
గ్రమమున సంసిద్ధుఁడై పరాంగతిఁ బడయున్. 18

నరకు సేయ కుల్లంఘించి శాస్త్రవిధిని,
గామమే పరాయణముగఁ గలిగి మెలఁగు
నీచమతి పొందనేరఁడు, నిజము, సిద్ధి
గాని, సుఖముగాని, పరమగతియుఁగాని. 19

ఆకారణమున విను, కా
ర్యాకార్యమ్ముల తెఱంగు లరసి యెఱుంగన్
నీ కెవ్వేళల శాస్త్రం
బే కద పరమప్రమాణ మింద్రతనూజా! 20

ఎది యెది శాస్త్రము నొడువునొ,
యెది యెది శాస్త్రమ్ము ద్రోసియుడునో, యది తె
స్న దెలిసి, స్వధర్మకర్మము
వదలక నీవ్వుం బొనర్పవలె నిహామందున్. 21

ఇది పదునాఱవ నధ్యాయము.

# పదునేడవ నధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

అనవుడుఁ గౌంతేయుం డిటు
లనుఁ: గృష్ణా! శాస్త్రవిధుల నటు లిడి శ్రద్ధా
ధను లయి యజించువారలు
మొనయంగల నిష్ఠ యెద్ది? బోధింపఁగదే. 1

తేజోమయ! సాత్త్వికమా?
రాజసమా? తామసంబ? రాజిలు నది యే
యోజం? దెలుపుము నా విని
యా జగదారాధ్యచరణుఁ డనుకంప ననున్. 2

శ్వేతవాహనుండ! స్వభావసిద్ధమైన
శ్రద్ధ యెల్లదేహులకును సిద్ధమకద,
అదియు మూఁడు తెఱంగుల నయ్యె, సాత్త్వి
కియును, రాజసియును, దామసియును ననఁగ. 3

భరతకులుఁడ! వింటె, ప్రతియొకప్రాణికి
సత్త్వమునకుఁ బోలెఁ జాలునట్టి
శ్రద్ధ పొనవుపడును; శ్రద్ధామయుం డయి
పురుషుఁ డెంతయేనిఁ బోలుపు మీఱు. 4

ఎవ్వఁ డెట్టిశ్రద్ధ నేపారు నెపు, డాతఁ
డట్టిశ్రద్ధతోడి యాతఁడ యయి,
తదనురూపమైన దారులఁ జేష్టించు
చుండువాఁడ యగును బాండవుండ ! 5

సాత్త్వికులు వేలుపుఁ గను, రాజసులు యక్ష
రాక్షసులను, దామసులు నిరంతరంబు
ప్రేతముల, భూతగణములఁ, బెరసి నమ్మి
కొలిచి పూజించుచుందురు కురుకుమార! 6

అడుగున నడుగునఁ దోడి యహంకారంబు,
కనులు వీఁపున కెక్క, కళలు దక్క
కడలుకొనఁ బ్రబలంబు కామరాగబలంబు,
డాంబికంబునకు వ్రతంబు లూని,
తిండి తిప్పలు మాని, తిగిచి వివేకమ్ముఁ
దమయింద్రియమ్ములతనువులతోడ
లో నున్న ననుఁగూడ మాన కెండించుచుఁ
దపముఁ దపింత్రు కొందఱు కిరీటి!

శాస్త్రవిధులతోడ సంబంధ మేమాత్ర
వారి కుండఁబోదు, ఘోరకర్మ
పరత నిలుతు; రట్టివార లాసురనిశ్చ
యుల యటంచు నీవు దెలియుమయ్య! 7

విను మాహారముసైతం
బనువుపడున్ మూఁడుగతుల; యజ్ఞము, యాగం

